

# వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

# కధలు కబులు - అవీ ఇవీ - ఏవేవో
# **20-08-24 to 26-10-24**

15.రావణుడు- ఆయన ఫది తలలు .    26 -10 -24

ఇది రావణుడి అంతు కనుక్కోవటానికి రాసినదే   కానీ రామాయణము నిజం కాదని చెప్ప టానికి రాయలేదు. "డైనో సార్"  కొన్ని మిలియన్ సంవత్సరాల క్రితం ఉండేదని  వాటి ఎముకలు దొరికి నాక నే  నమ్మాము . రావణుడికి ఫది తలలు ఉండేవి అంటే ఏ శిలాజాలు లేకుండానే నమ్ముతాము . ప్రపంచములో ఏమిపుట్టినా గానీ - దానికి జాతి యొక్క పోలికలు ఉంటాయి . రావణుడు ఎవరి పోలికా కాదా ? ఒక జీవిని  పోలి దాని పిల్లలు పుడతాయి . ఎదో ఒకే ఒక రి కోసము - అని దేముడు ఒక రూపములేదా నమూనాని  తయారు చేసి ముగిస్తాడా ? .  రావణుడి కోసం అల్లా తయారు చేసాడేమో ? రావణుడికి ముందు ఎవరికీ ఫది తలలు

లేకుండా పుట్టగా రావణుడు పున్నట్లుండి ఫది తలలు గల వానిగా పుట్టాడా ? అటు తరువాత అయన పోలిక ఇంకెవరికీ రాలేదా ?
ఒకే మనిషిలో వుండే రొండు మనస్తత్వాల గురించి { స్ప్లిట్ పెర్సొనాలిటీస్ గురించి } జాకిల్ అండ్ హైడ్ అనే ఇంగ్లీష్ నవల , అపరిచితుడు అనే తెలుగు సినిమా చెపుతుంది . రావణుడు ఫది రకాల మనస్తత్వం ప్రదర్శించిన అపరిచితుడా ఏమిటి ? .
మొదట హిందూ ఇజం లోని బ్రహ్మ వద్దకు ఒద్దాము. ఆయనకు నాలుగు తలలు ఉండటం నాలుగు వేదాలు వున్నయని సూచిస్తుందని నమ్ముతారు .వేదాలలో నాలుగవది ఐన అధర్వాణ వేదము ఓ ప్రత్యేక వేదము కాదని అది మొదటి మూడు వేదాల లోని విషయాలలో ని కలగలుపు అని కూడా అనేక మంది నమ్ముతారు . దీని ఆధారంగా బ్రహ్మ యొక్క నాలుగో తల గిల్లి వేయబడి ఆయనకు మూడు తలలు కల చిత్ర పఠాలు విగ్రహాలు వచ్చాయి . తిరుమల తిరుపతి దేవస్థానం వారు కూడా వేదాలు మూడు అని చెపుతూ ఓ పుస్తక ము ప్రచురించగా నేను చదివాను . బ్రహ్మ యొక్క

తలలు "వేదాలు ఎన్ని?" అంటే మూడు అని చెప్పే దానికి సూచికగా నిలిచింది .
చిత్రాలు చిత్రించే వారు- శిల్పాలు చెక్కే వారు తాము చెప్పతలుచుకున్న సంగతిని చెప్పటానికి - లిపిని వాడరు . వుదాహరణకు ఈయన కుబేరుడు అని చెప్పటానికి గానూ ఆయన పక్క ఒక డబ్బు మూట ను చూపుతారు .
కుబేరుడు దేవతల డబ్బుకు బ్యాంకర్ వంటి వాడు . అందు వల్లనే వెంకటేశ్వర స్వామీ కుబేరునుండి అప్పు తెచ్చుకున్నాడు . కుబేరుడు వ్యక్తిగా ఉన్నట్లు చూపే శిల్పం ఒక డబ్బు మూట తో ఉంటుంది . ఆయన బ్యాంకర్ గా వున్నాడు అని చెప్పదలిచినపుడు ఆయన పక్కన పేర్చ పడిన డబ్బు మూటలు ఉంటాయి . ఇలాగె ఇది సముద్రపు నీరు ఇది మంచి నీరు అని చెప్పే విధానం కూడా ఉంటుంది . నీరు అలలు అలలు గా ఉన్నట్లు చూపితే అది సముద్రము . సరళ మైన అడ్డగీతలతో చూపిన నీరు ఉంటే అది మంచి నీరు . ఈ పద్దతిలో ఆలో చించి రావణాసురుడి పది తలలు ఏమిటో కని పెట్టిన వారు ఇదివరకే వున్నారు .

రావణుడికి కి ఉన్న ఫది తలలు - ఆయన ఒకే విషయాన్ని ఫది రకాలుగా ఆలోచించి , ఫది రకాలుగా విశ్లేషించి ఫది రకాలుగా చెర్చించి , ఫది రకాలుగా పిచ్చలు పడే ఆయన మనస్తత్వానికి చెందినవి . ఆయన ఏదన్నా వ్యతిరేకించటం మొదలెడితే ఫది మంది కూడి ఒకే విషయాన్ని వ్యతిరేకిస్తే ఎట్లా ఉంటుందో అట్లా వ్యతిరేకిస్తాడు .పర స్త్రీల ను వంచించటము లోని ప్రమాదాలను విస్మరించటం లో - మామూలు వారికి వున్న మూర్ఖత్వము కన్నా రావణునికి పది రేట్ల మూర్ఖత వున్నదని అని చెప్పటానికి కూడా రావణునికి ఫది తలలు ఉన్నవని చెప్పబడింది . రావణుడు ఏకధాటిగా ఫది రోజుల పాటు యుద్ధము చేయగలడు కాబట్టి అతడు మహా సూరుడు అయినాడు . "రావణుడు ఇంకా ఎందుకు కూలి పోలేదు? అని రాముడు విభీషణుని అడిగి అబ్బుర పడ్డాడు అంటే ? తన కారణంగా యుద్ధములో సరి అయిన విశ్రాంతి పొందని రావణుడు- ఎంతో కొంత విశ్రాంతి ని కోరుకోకుండా తనతో యుద్ధాన్ని ఎలా కొనసాగిస్తున్నాడు ? అని ప్రశ్నించినట్లు . అది ఏదైనా

సరే, రావణుడు దేనినైనా మామూలు వారికన్నా ఫది రేట్ల సెక్తితో చేసేవాడు .వన్ ఇంటూ టెన్ లాంటి వాడు . ఈ శక్తియే రావణుడి పది తలలు . రావణుడికి ఉన్న ఫది రెట్ల బలము రాక్షశ సెక్తి గా భావింప బడి ఆయన రాక్షషుడు అయినాడు . ఆయనకున్న ఫది రేట్ల ఆలోచనా సెక్తి - గ్రహింపు శక్తీ వంటివి, ఆయనను సకల శాస్త్ర కోవిదుడు అని చెప్పేట్లు చేసింది.
లంక లో అనేక సంపదలు ఉన్నవని అనేక అద్భుత భవనాలు ఉన్నవని చదువుతాము . అంటే రావణుడు ప్రజల మేలు కోరి ఎన్నో చేసే వాడని అర్ధము - ఇట్లా రావణుడు లంక వారికి అభిమాన పాలకుడు . ఇదే కోవలో- నా ప్రజలకు మేలు చేసేది ఏమిటి? నా ప్రజలకు సంపదలు చేకూర్చేది ఏమిటి ? నా ప్రజలకు హితము చేకూర్చే మతము ఏమిటి ? వారు తమ ముక్తి కోసము నమ్మ వలసిన దేముడు ఎవరు ? అనే ఆధ్యాత్మిక విషయాల మీద కూడా రావణుడు ఏకబిగిన ఫది రోజుల చెర్చకు కూచునే వాడు. ఇట్లాంటప్పుడు రావణుడు గొప్ప భక్తుడు కూడా అయినాడు .
రావణుడు అనేది ఒక టీం యొక్క పేరు కూడా కావచ్చును . ఈ టీం లో - ఎప్పుడు చూసినా ఫది

మంది సభ్యులు వుంటారు . ఒకరు తరువాత ఒకరుగా పదిమంది ఒకే లక్షం వైపు ద్రుష్టి పెడతారు . ఏదన్నా అభిప్రాయం బేధాలు వచ్చినపుడు ఇందులో మొదటి స్థానంలో ఉన్న వ్యక్తి అభిప్రాయానికె  చెల్లుబాటు .
ఇట్లా రావణుడు అనే టీం లో  ఉన్న మొదటి వ్యక్తి లంకకు  రాజు కూడా అవుతాడు .
రావణుడు అన్న టీం  ఉన్నవారిలో ఏ ఒక్కరు నశించి పోయినా లేదా అందరూ ఒక్కసారే నశించి పోయినా ఆ మనుషులను తిరిగి  భర్తీ చేయగల యంత్రాంగం ఎదో ఉండేది . అందువల్ల రాముడు ,రావణుడి ఆయువు పట్టు ఏమిటో తెలుపని విభీషణుని అడిగాడు. ఇహ రావణుడి పొట్టలో ఉన్న అమృత భాండము అంటే ఆ రావణుడు అని పేరు గల టీం లోకి - నిరంతరమూ , సమర్థులైన బలమైన వ్యక్తులతో నింపే వ్యవస్థ కావచ్చును . యుద్ధములో భాగంగా రాముడు ఈ వ్యవస్థను ఛేదించి విజయం కైవసం చేసుకున్నాడు .
వారణాసి ఉమా శ్రీ రామకృష్ణ ఆఫ్ అమరావతి యొక్క సొంత అభిప్రాయము - రచన మరియూ  వివరణ .

## 14-అనుకోకుండా ఓ దారిలో 26 -10 -24

స్వీట్ అంటే తియ్యగా ఉండేది అని అందరికీ తెలుసు . ఒక స్వీట్ ని నేను తినకుండా ఇది తియ్యగా ఉందని చెపితే ? నేను చెప్పిన దానిలో- పరిపూర్ణత లేకుండా పోతుంది . అట్లాగే నేను అనుభవించని విషయన్ని మీకు చెబితే అందులో పరిపూర్ణత ఉండదు . అందువల్ల ఇక్కడ నావ్యక్తిగత అనుభవం తో కలిపి ఒక విష్యం వివరించటం జరిగింది .

ఒక పిల్లవాడు తన ఆటల్లో భాగంగా కుక్క మూతికి తాడు కట్టి దానిపైకి ఎక్కి గుర్రం ఆట ఆడాడు . ఓ చెట్టు పైకి ఎక్కి ఆ కొమ్మ ల్లోనుండి కిందనున్న చెరువు నీళ్ళలోకి దూకి తేలాడు . ఇట్లాగా ఆ అబ్బాయి ఎంతో ధైర్య వంతుడు .
ఈ పిల్లవాడే -- తనకు తోచిన ఆటలు ఆడీ పాటలు పాడి ఇంటివైపు తిరుగు ముఖం పట్టాడు. అప్పటికి చాల చీకటి పడింది . అతడు తన ఇంటికి పోవాలంటే - ఓ చీకటి సందును దాటుకొని ఇంటికి పోవాల్సిందేను .

ఇంకో దారి లేదు . ఇంటికి పోవటం తప్ప ఇంకో ఎంపికకు అవకాశము కూడా లేదు .

పిల్లవాడు సందు మొదలులో నిలబడి ఈ చీకటి సందులో - దెయ్యము ఉన్నదా ? తేలు ఉన్నదా ? పాము ఉన్నదా ? ఇందాక నేను భాదించిన కుక్క ఉన్నదా ? నిన్న విన్న కథలోని దయ్యము ఉన్నదా ? అది ఇప్పుడు నన్ను పట్టి పీక్కు తింటుందా ? ఈ చీకటిలో ఏముంది అని అనేక రకాలుగా భీతిల్లి పోతూ- భయంతో వణికి పోతూ ఆ సందు మొదట నే నిలపడ్డాడు .

ఇంతట్లో ఎవరో ఓ పెద్ద మనిషి అటు వచ్చాడు . అతడు మన చిన్న పిల్లవాడిని చేయి బట్టి సందు దాటించాడు . చీకటి సందు దాటేటపుడు పిల్లవాడు ఏమి చేస్తున్నాడు ?ఆ చీకటి మూలకంగా ఆ సంగతి మనకూ తెలీదు . భయాన్ని గెలిచినందుకు చిరు నవ్వు నవ్వుతూ వున్నాడు అంటే అది కూడా నిజమే అవుతుంది . మన పెద్ద మనిషి చేరిన మంచి పనిని బుద్ధుడు "గెట్టింగ్ త్రూ " అనగా భయాన్ని దాటి

వెళ్ళటం అని చెప్పాడు . చిన్న పిల్లవాడు అంటే మీరూ - నేనూ లాంటి ప్రతి ఒక్క మనిషీ నూ . ఆ చీకటి సందు భూలోకాన్ని వీడి మరోలోకం పోయే మధ్యలో వున్న మార్గము .

"ప్రతి ఒక్క మనిషీ తనను చీకటి సందు దాటించే మనిషి కావాలని కోరుకుంటాడు . నిజ జీవితం లో ఓ చీకటి సందు దాట టానికి ఒక కండలు తిరిగిన గండర గండడు ఎలా అవసరం లేదో అదేవిధంగా ఈ జీవితాన్ని దాటించటానికి గొప్ప వేదాంత వేత్త కూడా అవసరము లేదు . వేదాంత వేత్త తన గొప్పను వేరే మాటలలో ప్రవచిస్తూ వున్నాడు " అని బుద్ధుడు చెప్పిన బోధల సారంగా - " మనిషి ఒక చీకటి సందు దాటటం " అనే కాన్సెప్ట్ ను నేను నిన్ననే తోలి సారిగా గ్రహించాను . " ప్రతి సాధారణపు మనిషీ తన బౌద్ధ గురువును తనను చీకటి దాటించే మనిషిలా చూస్తాడు . మీరు అ ఆ పనినే చేస్తూ ప్రజలను దుఃఖము నుండి దాటించాలి " అని బుద్ధుడు బోధ చేసాడు . ఈ పనిని అయన " గెటింగ్ త్రు గా " లేదా "సందు దాటించటం" లాంటిది గా పేర్కొన్నాడు .

పై సంగతులు ఏమీ నాకు తెలియని రోజులు 11 . 09 -24 నాటి వరకూ నాకు వున్నాయి .పై సంగతులు నాకు నిన్న అనగా 24 -10 -24 న తెలిసాయి .

11 -09 -24 కు - నాలుగు రోజుల ముందు నుండీ ఆమె మంచం మీద వుంది . ఆమెకు మృత్యువు తప్పదు అని ఆమెకూ - నాకూ - మా పిల్లలకీ తెలుసును . కానీ ఆమె మమ్మ్మ వీడి పోవటం ఓ చీకటి సందు దాటి పోవటం లాంటిది అని మాకు తెలీదు . చీకటి సందు అంటే పరలోక ప్రయాణపు దారిలో నరకం అని .

నేను ప్రతి ఉదయం నిద్రలేవటం , ఓ కుర్చీ లాక్కొని ఆమె పక్క కూచోటం , ఆమె చేతిని నా చేతిలోకి తీసుకొని నిమురుతూ కూచోటం , ఆమె నా చేతిని తీసుకొని తన తొడపైనో పొట్ట పైనో పెట్టుకోవటం నిత్యా కృత్యం గా జరిగింది ." పాణీ గ్రహణం ' అంటే ఇది అని నేను మా పిల్లలకు అరిచి చెప్పాలి అనుకున్నాను . నాకే అర్థం కానీ దుఃఖాన్ని వారికెందుకు పరిచయం చేయాలి అని నేను మిన్న కున్నాను .

ఆమె పాణీ గ్రహణం చేసి - ఏదో ఆలోచిస్తూ నేను తల కిందకు . వాల్చాను . కాసేపటికి మా అమ్మాయి శైలజ వచ్చి " నాన్న నిద్ర పోతున్నావా ? " అన్నది . "లేదమ్మా -- కనులు మూసుకుంటే ఏదో కల లాంటిది ఒచ్చింది . ఆ కలలో కాళికా దేవి నాలుక చాపి - వికట నృత్యం చేస్తూ మీ అమ్మ కోసము వస్తూ వున్నది . నేను ఆమెను చూసి " తల్లీ నీవట్లా రావద్దు . నీ పెట్లా వస్తే నీ అనుచరగణము అట్లా వస్తారు . అనగా ఆమెను ప్రతి అవయములోనూ భాదించుతారు . నీవు ఆ డప్పు డాన్సులు మాను . అమృత భాండము కడుపున కల వాడు రావణుడికే మృత్యువు తప్పలేదు . కాబట్టి ఈమెకు మృత్యువు లేకుండా చేయమని నేను కోర రాదు . నీవు దయచేసి సింహవాహినిపై - ప్రశాంత రూపము తో వచ్చి - ఓ తల్లి తన పిల్లను చంకన ఎత్తుకొని పోయినట్లు ఆమెను ఎత్తుకొని పోవమ్మా " అని కోరాను-- అని నా కూతురికి చెప్పాను . ఇది నా భార్య కూడా విన్నది . విని- నా భర్త నేను ఏమీ భయపడకుండా - భాద పడకుండా సందు దాటి పోవాలని ఎంతో ఆలోచిస్తున్నాడు - అందుకోసమే అయన నా పాణీ గ్రహణం చేసాడు " అని ఆమె

అనుకున్నదో లేదో ?నేను ఇప్పుడు చెప్పలేను .ఏది ఏమైనా  నాకు తెలిసీ తెలియక బుద్ధుడు బోధించిన ది -- మానవుల పట్ల మానవులు చేయ గలిగినది - చేయతగినది - అయిన "సందు దాటించటం" అనే పనిని సంపూర్ణ విశ్వాసంతో చేసాను  . నా  మాటలు- అందులోని నా విశ్వాసము -  విని ఆమె కు  మృత్యు భయం లేకుండా చేసి  --  "నన్ను సంహరించి కాక , చంకన  ఎత్తుకొని తీసుకో పొమ్మని ఆ దుర్గా దేవికి ఓ విన్నపం జరిగింది . నేను అలానే అనుగ్రహింప పడతాను" అని నమ్మి ప్రశాంతత పొంది అదే  ప్రశాంత వదనంతో మమ్ము విడిచి పోయింది .
ఏమీ తెలియక పోయినా " గెట్టింగ్ త్రు " " చీకటి సందు దాటించటం " అనే ప్రక్రియను నేను అమలు పరిచి ఫలితం పొందాను . ఇంత చేసిన వాడిని ఆమెకు మృత్యువు తప్పించమని ఎందుకు అడగ లేకా పోయాను ? నా ప్రయత్నం లో ఆ లోపము ఎందుకు చేసాను అని నన్ను నేను ప్రశ్నించుకొన్నపుడు నన్ను - విషాదము ఆవరిస్తూ ఉంటుంది  . ఈ ప్రశ్నకు  కూడా నేను ఎదో ఒక రోజుసమాధానము కనుగొన  గల నెమో ఏవరికి తెలుసు ?

దుర్గా దేవి అంటే ఆమెకూ నాకూ కూడా తల్లి వంటిది .ఒకనాడు ఏదో పరాచి కానికి "దుర్గా దేవి అంటే నీ అత్తగారు " అన్నాను . " కాదు నాకు అమ్మ . కావలనంటే నీకే అత్తగారు  అని ఆమె బదులిచ్చింది . ఒకే దేవత యందు మా ఇరువురి భక్తి ఆలా ఉండేది . అందువలన ఆమె - నా మాటల ద్వారా "తన తల్లి వంటి దుర్గా దేవి తనను చంకన ఎత్తుకొని ఒక చీకటి సందు దాటించటానికి వస్తున్నదని వూహా చేయగలిగి " ప్రశాంతము గా తీరము దాటి పోయిందని నేను మరల మరల చెప్పగలను .
దుర్గా దేవి నిజంగా ఉన్నదా ? నీతో - నీ వంటి వాడితో నిజంగా మాట్లాడిందా? అనే సందేహము మీకు వచ్చినప్పటికీ - నా మాటలు ఆమె మీద ఏమీ ప్రభావము చూపలేదని మీరు  అనలేరు అనుకుంటాను . మొత్తానికి తెలిసీ తెలియక - ఎవరి సలహా సంప్రదింపులు లేకుండానే ఆమెను  ' గెట్ త్రు " చీకటి దాటి పోయేట్లు చేయి పట్టుకున్నాను  .
పైలాగా  చేసిన  ,రెండు నెలల లోపున నేను చేసింది ఏమిటో నాకు బోధ పడింది  .

చావుకు సమీపంలో వున్నవారిని -లేదా చని పోయిన వారి సంతానాన్ని పలక రించ పోయినపుడు మనము ఎదో ఒకటి మాట్లాడి - కాల క్షేపం చేసి రావటమేనా ఇంకా ఏదన్న ఉత్తమ విధానము ఉందా అని నేను ఇంతకు మునుపు అనేక మార్లు ప్రశ్నించుకున్నాను . నా నిజ జీవిత లో ని పై సంఘటన ద్వారా - మృత్యువుకు సమీపంలో వున్న వారిని- లేదా వారి బంధువులను ఓదార్చేందుకు వున్న ఉత్తమ విధానము ఏమిటో తెలుసుకున్నాను . అది వారి "గెట్ త్రూ " కి ఉపకరించటమే . మొత్తము మీదా - నేను ఒక స్వీట్ నో లేదా ఒక హాట్ నో రుచి చూసి న తరువాతనే మీకీ విషయాలు చెప్పాను .

తన స్వీయ అనుభవాన్ని మీతో పంచుకొన్నది - వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

13.అమ్మపాలి కథ 24 -10 -24

పాళీ భాషలో ని  "అమ్బపాలి" అని పలికే పేరును సంస్కృతం లో "ఆమ్రపాలి" అని పలుకుతారు.  . ఈమె వైశాలి దేశపు రాజ నర్తకి . ఎంతో సంపద ఎన్నో ఘనతలు సాధించిన స్త్రీ . బుద్ధుడు ఈమెను  శిస్యు రాలిగా స్వీకరించినపుడు  తనకు ఉన్న అన్ని భౌతిక సంపదలనూ బుద్ధునికి ధార పోసింది .

 ఆమ్రపాలి యొక్క కథ  కథ హిందూ - బౌద్ధ  , జైన మతాల కథకులు తలో రకంగా చెపుతారు  . ముగ్గురూ మూడు రకాల ముగింపులు ఇచ్చారు . ఒక  బౌద్ధ కథగా దీన్ని తెలుసుకుందాము  .

ఆమ్రపాలి   600-500 BC.నాటికి నిజంగా ఉన్న స్త్రీ . వైశాలి లోని రాచ ఉద్యాన వనము లోని ఒక మామిడి చెట్టుకింద ఒక అనాథ శిశివుగా అక్కడి తోటమాలి కి ఈమె దొరికినందున ఈమెను ఆమ్రపాలి అనే పేరుతో పిలుస్తారు .   ఆమ్రపాలి అనగా "మామిడి చిగురు"అని అర్ధము .

ఆమ్రపాలి తన 11 వ సంవత్సరం  నాటికే వైశాలి లో కెల్లా అందగత్తెగా గుర్తించ బడింది . అనేక మంది పురుషులు ఆమెను మోహిస్తూ ఉండటం  వల్ల - వారి

బారి నుండి ఈమెను తప్పించటానికి అని ఈమెకు వైశాలీ నగర రాజ నర్తకి పదవిని ఇచ్చారు.
ఆమ్రపాలి , తన యవ్వనపు మొదటి దశలోనే ఒక యువకుడిని ప్రేమించి పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం లో వున్న ది .వైశాలీ రాజు మనుదేవ్ , ఆమ్రపాలి ఇష్టానికి వ్యతిరేకముగా ఆమెను తన సొంతము చేసుకోవాలనుకున్నాడు . ఆమ్రపాలి వేరొకరి సొత్తు కారాదని ఆలోచించిన రాజా మనుదేవ్-- ఆమ్రపాలి కి పెళ్లి జరగనున్న రోజుననే ఆమె ప్రియుడిని చంపించి, ఆమెను "నగర వధువు " గా ప్రకటిస్తాడు . నగరవధువు అంటే ఆమెను ఎవరైనా ప్రేమించ వచ్చు ఆ ప్రేమను బహిరంగ పరుచుకోవచ్చు ., ఆమెకు వున్న " నగర వధు" అనే పేరు అందరికీ కల్పించే అవకాశం ద్వారా , తాను కూడా అమ్రపాలిని ప్రేమించానని బహిరంగంగా ప్రకటించుకో వాలన్న ది రాజు గారి వూహ .
ఈ పదవితో పాటు ఆమ్రపాలి కి "జనపద కళ్యాణి " అనే బిరుదు పదవి కూడా ఇచ్చారు . ఈ హోదాలో ఆమె కు తనను ప్రేమించానని చెప్పే వ్యక్తుల నుండి తాను ప్రేమించ దలచిన వ్యక్తిని ఎంచుకునే హక్కు

దొరుకుతుంది . ఈ రకంగా ఆమె వైశాలీ రాజునూ కూడా తిరస్కరించవచ్చు లేదా ఎంచుకో వచ్చు . వైశాలి రాజ్యము ప్రజాస్వామ్య రాజ్యము కావటం తో - ఆ నాటి ప్రజలు అనుసరించే సామాజిక న్యాయము ను అనుసరించి ఆమెకు ఇటువంటి హక్కులు దొరికాయి .ఇది - ఆమె తన ప్రియుని కోల్పోయినందుకు గానూ దక్కిన ఊరట అని కూడా అనవచ్చును .

ఆమ్రపాలి యొక్క అందము గురించి - వైశాలి కి పక్కరాజ్యమైన మగధ రాజ్యానినికి రాజైన బింబిసారుని చెవిన పడింది . ఆమ్రపాలి మీద కోరికతో బింబి సారుడు వైశాలి మీదకు దండెత్తి వచ్చాడు . యుద్ధము దాని దారిన అది జరుగుతూ నే ఉండగా - బింబిసారుడు మారు వేషంలో వెళ్లి ఆమ్రపాలి ఇంటిలోనే ఆశ్రయం పొందుతాడు .తన ఇంటిలో వున్నది బింబి సారుడని ఆమ్రపాలి కి తెలియదు . వీరి ఇద్దరి మధ్య నిజమైన ప్రేమ పుడుతుంది . వీరికి ఒక కుమారుడు కూడా జన్మిస్తాడు .
.చివరికి ఎప్పుడో తాను ప్రేమిస్తున్నది బింబి సారుడిని అని ఆమ్రపాలి తెలుసు కుంటుంది . తమ దేశం మీద

యుద్ధాన్ని మాని వేయమని తన ప్రియుడిని కోరుతుంది . యుద్ధం ఆగి పోతుంది. వైశాలి నగరంలోకి ప్రవేశించి ఒక స్త్రీ యొక్క ఇంటిలో దాగున్న పిరికి రాజుగా, ఒక స్త్రీ కోరిక మీద యుద్ధ విరమణ చేసిన కాముకునిగా తనకు చెడ్డ పేరు రాకూడదు అని ఆలోచించిన బింబి సారుడు తన ప్రేమ గురించి లోకానికి తెలుపుకోడు .

బింబి సారుడికి ఆయన భార్య అయిన చేలన కు పుట్టిన సంతానము అజాతశత్రు . ఇతడు తన తండ్రి నుండి వారసత్వంగా తనకు దక్కవలసిన రాజ్యము ఎంతకూ దక్కక పోవటానికి విసుగు చెంది, తన తండ్రిని చంపి మగధకు రాజు అవుతాడు . .

దీని తరువాతి కథ జైన సాహిత్యాన్ని అనుసరించి ఇలా ఉంటుంది " అజాత సెత్రుడు తనకు జన్మించిన కుమారునికి గోరుముద్దలు తినిపిస్తూ, తన తల్లిని చూసి " కుమారుని పై నాఅంతటి ప్రేమ కల తండ్రి మరొకరున్నారా ? అని ప్రశ్నిస్తాడు . " నీ తండ్రి వున్నాడు " అని ఆమె బదులిచ్చి , అతని తండ్రి అతనికి జరిపిన ముద్దు ముచ్చట్లను- తినిపించిన గోరుముద్దలు గుర్తుకు చేసుకుంటుంది . దీనితో అజాత

సెత్రు సిగ్గు పడి తండ్రిని జైలు నుండి విడుదల చేయ తలుస్తాడు . ఆ ఉద్దేశ్యం కలిగిన వెంటనే " ఇంకా అలాస్యము చేయరాదు " అన్న తలంపుతో అజాత సెత్రుడు ఒక గొడ్డలి చేబూని తండ్రికి ఉన్న సంకెలలు ఛేదించేందుకు గానూ తండ్రి ఉన్న ఖైదు వద్దకు నడు స్తాడు. గొడ్డలి చేబూని వస్తున్న కొడుకును చూసిన బింబి సారుడు - కొడుకు తనను చంపటానికి వస్తున్నాడు అని పొరబడి .చేతి వేలికి ఉన్న ఉంగరం లోని విషం మింగి మరణిస్తాడు . చివరి ప్రార్ధనలు కూడా చెప్పుకోకుండా తండ్రి మరణించటం అనే విషాదాన్ని జీర్ణించుకోలేని అజాతశత్రువు మనస్తాపంతో తన రాజధాని ని చంపా నగరానికి మారుస్తాడు .ఒక దుఃఖము మర్చి పోవటానికి అని ఎదో ఒక పెద్ద కట్టడపు నిర్మాణానికి పూనుకోవటం అనే విధానము ఆనాటికే వుంది . దానిని అనుసరించి అజాతశత్రువు పట్టణ నిర్మాణము చేసాడు అని నా వివరణ . తాజమహల్ , భాగ్యనగరం వంటివి ఒక విషాదాన్ని ఎదుర్కోవటానికి కట్టిన కట్టడాలే కదా ?
ఒకరికి ఆఖరి ప్రార్ధనలు చేసుకొనే అవకాశం ఇవ్వక పోవటం అనేది ఆ మరణానికి కారకులైన వారిని

ఎంతైనా వెంటాడి భాదిస్తుంది . అందుకే మరణ శిక్ష పడిన వారికి చివరి ప్రార్ధన చెప్పుకునే అవకాశం ఇస్తారు . మరణాన్ని ఒక దీర్ఘ నిద్ర అని కూడా కొందరు పిలుస్తారు . అది కూడా నిజమే . అలసి పోయిన దేహాన్ని సేద తీర్చి రేపటి పనులు చేయటానికి వీలుగా మనము నిద్రిస్తాము .శిధిల మవుతున్న దేహాన్ని వీడి మరొక దేహాన్ని పొంది - ఇంకెన్నో మంచి పనులు చేయటానికి వీలుగా మనుషులు మరణిస్తారు . నా భార్య కూడా ఈ కారణంగానే దీర్ఘ నిద్రలోకి వెళ్ళింది , అని నేను ఈ సందర్భంగా చెప్ప తలిచాను .

ఈ కధకు సంభందించి బుద్ధిష్ట్ లు చెప్పేది ఇలా ఉంటుంది . అజాతశత్రు తన తండ్రిని ఖైదు చేసి నాక ఎన్నోక్రూర శిక్షలు అమలు జరిపాడు . అన్నము నీరు ఇవ్వకుండా భాదించాడు . తన భర్త అయిన బింబి సారునికి అన్నము - నీరు ఇచ్చేందుకు అయన భార్య కోసల ఎన్నో దారులు వెతికింది . అజాత సెత్రుడు తన తల్లి కనుగొన్న ప్రతి దారినీ అడ్డగించి భగ్నపరిచి - తన తల్లి తన తండ్రికి ఆహారం ఇవ్వకుండా చేసి మరీ తండ్రిని ఇంకా ఏంటో బాధించాడు .

బింబి సారుడు  తన జైలు గది కిటికీ నుండి ఒకొండ పైకి చూస్తూ వుండే వాడు . ఈ కొండపైన బుద్ధుడు తన అనుమాయిలతో కలిసి విడిసి వున్నాడు . లీలా మాత్రంగా నైనా సరే బుద్ధుని దర్శనం దొరకవచ్చేమో ? అన్న  ఆశతో బింబిసారుడు కొండవైపు చూస్తూ ఉండేవాడు  .  ఇది తెలిసినాక అజాత సెత్రువు ఆ గదికి ఉన్న  కిటికీని   మూయించి ఎల్లెడలా చీకటే ఉండేట్లు ఏర్పాటు చేసాడు .
ఇటుతరువాత బింబి సారుడు " బుద్ధుడు ఈ నగరం లో ప్రవేశిస్తే అయన నుండి వచ్చే వెలుగును నేను చూడగలుగుతాను  కదా ?  " అనే ఆశతో,  జైలు ద్వారపు చిల్లుల నుండి బయటకి చూడటం మొదలెట్టాడు . ఇది గ్రహించాక అజాత సెత్రువు మరింత కౄరుడై , తండ్రి ఎటూ కదలకుండా వుండాలని చెప్పి అయన అరికాళ్ళ చెర్మం ఒలిపించేసాడు .
ఒకనాడు , అజాతశత్రు - తన తల్లి మాటల వల్ల    - తన తండ్రి తనను ఎంత ప్రేమగా చూసిందీ గుర్తుకు తెచ్చు కున్నాడు . తండ్రిని జైలునుండి వదిలి వేయటానికి నిర్ణయించుకున్నాడు . తనను  విడుదల చేసి నట్లే విడుదల చేసి   .  ఆపై తన కొడుకు  తన పట్ల

ఇంకా ఎదో ఘాతుకానికి ఒడ గట్టనున్నాడని { ఎదో ఎన్కౌంటర్ లాంటిది చేస్తాడని }  - కొడుకు చేతులో హింస పడరాదని ,  అలా మరణించ రాదనీ కోరుకుంటూ బింబిసారుడు తన ప్రాణాలు తానే తీసుకున్నాడు .

తండ్రి మరణం తరువాత- ఆధుఖాన్ని మర్చి పోయే ఉద్దేశ్యముతో -- అజాత శత్రువు  మగధ కి వ్యతిరేకమైన  లిచ్ఛవులు పాలించే  వజ్జి దేశము మీదకు ,  వైశాలి , కోసల , కాశి వంటి రాజ్యాల మీదకు యుద్ధానికి వెళ్లి వాటిని జయించాడు .
ఏమో అనుకుంటాము కానీ - ఎవరికైనా సరే  తండ్రి మరణించిన దుఃఖము తప్పక మనసున నాటి తీరుతుంది .సాధారణ ప్రజలు తద్దినాలు పెట్టి ఆ దుఃఖాన్ని తీర్చుకుంటారు. అజాతశత్రు విధ్వంసము సృష్టించటం ద్వారా  తన తండ్రి మరణించిన  దుఖ్ఖాన్ని మాన్చు కొనే ప్రయత్నం చేసాడు .

వైశాలి ని జయించిన ఆనందముతో , అజాతశత్రు వైశాలి పురవీధులలో  ఊరేగింపుగా నడువ సాగాడు .

అజాతశత్రు కూడా ఆమ్రపాలి అందం గురించి విని వున్నాడు . అతడు ఒకనాడు ఆమెను సందర్శించి ఆమె అందం ముందు మోకరిల్లాడు . ఆమెకూడా అజాత శత్రువుని ప్రేమ దృష్టితో చూసి ఆదరించింది. ఇద్దరికీ శారీరక సంభందం ఏర్పడింది . అప్పటికి-- ఆమ్రపాలి ప్రేమ కామ ఆవేశాలకు అతీతురాలు కాని సాధారణ స్త్రీ గా వున్నది .  కానీ దీనికి పైశాలీ పౌరులు అభ్యంతరం చెప్పి ఆమె ఒక కులట  లా ప్రవర్తించింది కాబట్టి  ఆమెను శిక్షింపాలని కోరారు . ప్రజల ఒత్తిడి మేరకూ   ఆమె  కారాగారం లో బంధింప బడింది . తాను ప్రేమించిన ఆమ్రపాలి కి ఖైదు లభించిందన్న కోపంతో అజాత సెత్రు పైశాలీ నగరాన్ని అగ్నికి ఆహుతి చేసాడు .వేలాది మందిని నరికి చంపాడు . ఆమ్రపాలి ఖైదు నుండి బయటికి వచ్చింది . తన ప్రేమను చాటుకున్నాను అని అజాత సెత్రువు అనుకున్నాడు .నా వల్ల నా మాతృ భూమి నాశనం అయింది అని ఆమ్రపాలి దుఃఖ పడింది . తన eeదుఃఖ నివారణకు గానూ ఆమె బుద్ధుని ఆశ్రయించింది .
అజాత సెత్రు వు రాజ్యములోనే అజాతస్తువు ప్రేయసి ఎలా ఖైదు చేయపడింది ? అంటే అది ప్రజావాణికి

ఉన్న బలం అని చెప్పుకోవాలి . ప్రజాగళానికి వ్యతిరేకంగా అజాత సెత్రు కూడా ఏమీ చేయలేక పోయాడని - ప్రభువులకన్నా ప్రజలే గొప్పవారని మనము గ్రహించుకోవాలి .

ఇప్పటి తన ప్రియుడు అయిన అజాత సెత్రువు -- ఒకప్పటి తన ప్రియుడైన బింబి సారుని కొడుకే నని ఆమ్రపాలి కి తెలుసునా లేదా ?, తనకు పుట్టిన బిడ్డకు బింబిసారుడే తండ్రి అని ఆమ్రపాలి కి తెలుసునా లేదా ?, అజాత సెత్రుడు తండ్రిని చంపిన క్రూరుడు అని - అంతటి క్రూరుడిని తాను ప్రేమించానని ఆమ్రపాలి కి తెలుసునా లేదా అన్న సంగతిని బౌద్ధ గాధలు వివరించవు .జరిగిన సంఘటనల వల్ల ఆమె అనేక రకాల దుఃఖాన్ని చవి చూసిందని మాత్రమే బౌద్ధగ్రంధాలు చెపుతాయి .

అజాతశత్రు అనేక రాజ్యాలు కలిసిన ఓ పెద్ద రాజ్యానికి చెక్రవర్తి అయినాడు . అతడు మగధ రాజ్యాన్ని మరింత పటిష్టం చేయటము కోసము గంగా తీరము ఒడ్డున పెద్ద కోటను కట్టించాడు . సునీధ మరియూ వస్సకార , అనే మంత్రుల ఆధ్వర్యంలో ఈ కోట నిర్మాణము జరిగింది . ఈ కోట నిర్మాణము జరిగిన ప్రదేశము పేరు

పటలా గ్రామా . కోట నిర్మాణము అయ్యాక ఈ వూరు పాటలీపుత్ర అయ్యింది . అది నేటి పాట్నా గా మనకు తెలుస్తున్నది . బుద్ధుడు ఈ పట్టణాన్ని ఎంతో పొగిడి - మూడు విపత్తులు - పాటలీ పుత్రని నాశనం చేయనంత వరకూ ఆ పట్టణము వర్ధిల్లుతుందని ఆశీర్వచనం పలికాడు . ఇదే సంగతిని మనము ఇంతకు మునుపే- ఇదే మహా పరినిబ్బాన సుత్తములో భాగంగా - బుద్ధునికి ఆనందునికి మధ్య జరిగిన సంభాషణ ల ద్వారా తెలుసు కున్నాము . { నిప్పు నీరు భిన్న అభిప్రాయాలూ అనే మూడు దేనిసైనా నాశనం చేసే విపత్తులు - అని బుద్ధుడు పలికాడు }
అజాత శత్రువుని అతని కొడుకు "ఉదయాభద్ర" అను నతడు చంపి వేసాడు . తన మరణం తరువాత అజాతసెత్రువు "లోహకుమ్భియా " అనగా లోహపు పాత్రలలో మనుషులను ఉడికించి వేయించే నరకము లో పుట్టాడు అని బుద్ధిజం చెపుతుంది . ఇతడు అనేక జన్మలు ఎత్తి బుద్ధుని బోధనలు చూపిన దారిలో నడిచి చివరిలో మోక్షము పొందాడు .
అజాత సెత్రువు మరు జన్మలు ఎత్తి నపుడు బుద్ధుడికి ముఖ్య అనుమాయిగా మారి బుద్ధుని అస్థికలు మీద

పెద్ద స్థూపాన్ని కూడా నిర్మించాడు . బుద్ధుడు అనేక జన్మలు పొంది వున్నాడని జాతక కథలు వివరిస్తాయి . అందువల్ల తన ఎదో ఒక జన్మలో అజాత సెత్రువు బుద్ధుని యొక్క శిష్యుడు ఐనాడని చెప్పటం సాధ్యమైంది .

తన జీవితము - తన అందము - తనను పొందాలి అనే కోరిక యుద్ధాలకు- జనావళి మరణాలకు కారకం ఐంది అని దుఃఖించిన ఆమ్రపాలి - తన దుఃఖానికి విరుగుడు కోసమై బుద్ధుని ఆశ్రయించింది . ఆయన్ని చూడాలని భోజనం తినిపించాలిఅని అయన పరిచర్యలలో ఉండాలి అని కోరుకుంటూ ఉండేది ..ఇటువంటి ఆమ్రపాలి యొక్క వనం లో బుద్ధుడు విడిది చేసాడు . బుద్ధునికి వైశాలిలో రాజ ఆహ్వానమే వున్నది . దాన్ని కాదని బుద్ధుడు ఆమ్రపాలి వనంలో విడిది చేసి ఆమె ఇచ్చిన బిక్ష స్వీకరించాడు .బిక్ష అనంతరము ఆమ్రపాలి తన సంపద - బుద్ధుడు విడిసి ఉన్న మామిడి వనం తో సహా - అంతా బౌద్ధ సంఘానికి ఇచ్చి వేసింది .

ఈ సందర్భంగా బుద్ధుడు విడిది చేసిన మామిడి వనం ఆమెకు ఎలా సొంత మయింది ? ఎవరి నుండి అన్నా ప్రేమ కానుకగా స్వీకరించిందా? బుద్ధుడు పూర్వ పర విచారము చేయకుండానే ప్రతి కానుకా స్వీకరించే వాడా ?   అనే ఆలోచన కూడా నాకు వచ్చింది  . ఆమె మామిడి వనం లో పుట్టింది కాబట్టి - అది ఆమె పుట్టినింటి కింద భావించబడి, ఆ వనం పై ఆమె సర్వ హక్కులు పొందింది అనే ఆభిప్రయం కలిగించే  వివరణ దొరికింది  . అనగా ఆమ్ర పాలి అనే ఆ పిల్ల ఓ మామిడి వనం లో దొరికింది కాబట్టి - దేముడు ఆ చోటును ఆమె పుట్టుక కోసం ఎంచు కున్నాడు కాబట్టి , ఆ వనం ఆమెకు చెందుతుంది  అనే జన సామాన్య అభిప్రాయం ప్రకారం ఆ వనం ఆమెకు దక్కింది .

ఇ

నా భార్య ఉమా దేవి 11 -09 -2024  న మరణించింది .ఆమె తన ఆఖరి ప్రార్ధనగా - గతించి పోయిన ఆమె ఇద్దరు అక్కలనూ  " ఓ పెద్ద క్కాయి . ఓ  రామా అక్కాయి అని తలచు కొని -- ఓ దుర్గమ్మా,  ఓ బాల చాముండీ, ఓ కాళీ దేవీ "  అని పిలుస్తూ స్మరించింది .  "రక్షించండి - నను కాపాడండి " అనే మృత్యు ఘోష

మాత్రం చెయ్యలేదు . మరణానికి ఎన్నో గంటల ముందే తన ఈ దైవ స్మరణ పూర్తి చేసుకొని - ప్రశాంతత పొంది అదే ప్రశాంతత మరియూ ప్రశాంత వదనం తో మరణించింది.

మరణానికి ముందు ఆఖరి ప్రార్ధనలు చెప్పుకోవటానికి అవకాశం దొరకటం వారికి ఎంతో ప్రశాంతత నిస్తుంది . ఆ ప్రసత్తే  వారి ముఖంలో కూడా ప్రకాశిస్తుంది . ప్రశాంతత పొందకుండా మరణించిన వారి ముఖ కావళికలలోని అసహ్యాన్ని - చూసి ఏ మానవుడూ తట్టుకోలేడు .

**Varanasi vumadevi died on 11-09-24to re-born else where**

రచన వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

12.స్త్రీల ఔన్నత్యము .                    23 -10 -24

చిన్న విషయాల పట్ల ఉన్నత అభిప్రాయాలను ఏర్పరుచుకోవడం మన జీవితంలో ఒక మెరుపు మెరిపిస్తుంది . మెరుపు వెలుగులో -- లక్ష దీపాల మధ్య చూచిన దానిని మించి ఎదో చూస్తాము . బుద్ధుడు ఒకే వాక్యంగా చెప్పిన దానిని నేను మీకు వివరణ చేస్తున్నాను .

ఒక స్త్రీ తన పిల్లలను ఎవరో అపహరించినట్లు , ఏ క్రూరమృగమో వచ్చి వారిని నోట కరుచుకు పోయినట్టు ఏదన్నా కల కన్నది అనుకోండి - అప్పుడు ఆస్త్రీ గుండెలు బాదుకుంటూ నిద్రలేచి - కన్నీళ్లతో పిల్లలను

దగ్గరకు పోదుముకోని- కన్నీళ్లతో దేముళ్ళను అర్చిస్తూ ఎన్నో ప్రార్ధనలు చేస్తుంది . నిజం కాని ఒక భాద పట్ల నే స్త్రీ ఇంత చేస్తూ వుందికదా ? మరి నిజంగా ఎదురైనా బాధ పట్ల ఏమిచేస్తున్నది ?
ప్రతి స్త్రీ ప్రసవ వేదన పడినపుడు అది  తన ప్రాణాల మీదకు వచ్చింది అని భావిస్తుంది .తాను నిజంగా అనుభవించిన ఈ నిజమైన   భాదను,  ఏ స్త్రీ కూడా మరలా  కలకని , ఆ బాధతోనూ,  కన్నీటి తోనూ నిద్రలేవదు . ఎన్నడూ కూడా నాకు ప్రాణ గండాలు సృష్టించే  ఈ పిల్లల  పుట్టక అనేది లేకపోతే  ఎట్లా ఉండేదో ఆనుకోదు . ఇలాంటి ఆలోచనలు చేయకపోవటం మరియూ ఆలాంటి కలలు కనక పోవటం లోనే స్త్రీలకు చెందిన ఔన్నత్యం వుంది . ఎక్కడనో కొద్దీ మంది అయోగ్యులు వుంటారు . వారు తమ ప్రవర్తనతో తమ తల్లికి ఆమె పురుటి నొప్పులను మించిన నొప్పులు కలగ చేస్తారు . ఇలాంటి అయోగ్యులే రాక్షశ మూక . మహిషాశుర మర్ధిని వంటి దేవతలు ఇలాంటి వారినే సంహారం చేస్తూ వుంటారు . రాక్షసులు అంటే స్త్రీ పట్ల ఉన్నత మైన ఆలోచన లేని వారే .

ఇక ప్రతి ఇంటిలోని స్త్రీ ఆ ఇంటిలోని మెరుపు . నా చెల్లి లోనో నా అక్కలోనో అందం ఉన్నపుడు ఆమె మెరుపులాగా ఉందని నేను అనలేను కదా . ప్రతి స్త్రీలో నూ  వుండే ప్రక్రృతి సిద్ధ మైన గుణమే  ఆమె లోని మెరుపు. మెరుపు లో ఏమున్నదో అనే సంగతి మీద ఎవరో ఒకరు  పరిశోధించి అందులో విద్యుత్ వున్నదని చెప్పారు.  అలాగే స్త్రీ ని  అర్థం చేసుకోకుండా ఆమెలోని మెరుపు ఏమిటో మనము గ్రహించలేము .  తాను ఒక మెరుపు లాంటిది ఎందుకు అవుతుందో అనే విషయాన్ని -   ఆమె తనకు  తన కుటుంబము పట్ల ఎంతో ప్రేమ కలిగినపుడు- తనకు తానుగా  వెల్లడి చేసుకుంటుంది . మెరుపు ఆకాశం లో ఉండేది . స్త్రీ తాను నింగికి వెళ్ళినాకనే నేను నీపట్ల మెరుపును అని చెప్పుకుంటుంది . ఆ గ్రహింపు కూడా మనకు అప్పుడే వస్తుంది . ఈ లోపు ఆమెను ఎవరు ఏ భావంతో చూసినా ఆమె సహిస్తుంది . అందంగా లేవని భర్త నిందిస్తాడు . పిల్లలు ఎదో పాఠాలు చెప్ప బోతారు . మెరుపుకే   మెరవమని చెప్పే పాఠాలా ? అని స్త్రీ ఎన్నడూ అనదు . అదే ఆమె ఔన్నత్యం .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత రచన .

11.నచ్చ చెప్పుడే మంచిది ... 2-10-24

ఫది రూపాయల నోట్ల పరిస్థితి ఎంత ఘోరం గా ఉందో మీకూ తెలుసు . అవి కావాలంటే దొరకటం లేదు . మనమిస్తే ఎవరూ తీసుకోవటం లేదు . ఎందుకంటే అవి ఎన్నో బొక్కలు పడి మధ్యన చినిగి ఉంటున్నాయి కాబట్టి . ఇలాంటి ఫది రూపాయల నోటు ఒక కిళ్లీ షాప్ లో ఇచ్చి ఐదు రూపీల్స్ ఒక్కపొడి పొట్లం ఒకటిమ్మని అడిగాను . " ఈ నోటు చెల్లదు " అన్నాడు . రిజర్వ్ బ్యాంకు గవర్నర్ రొండువేల నోటుని చూసి ఇది చెల్లదు అని ఎంత ఖరాకండిగా చెపుతాడో అంత ఖరా ఖండీగా చెప్పాడు ఆ షాపు వాడు . "ఇది నీలాంటి వారు ఎవరో ఇచ్చినదే . మార్కెట్ పరిస్థిని అర్ధం చేసుకొని ఈ నోటు తీసుకున్నాను .నువ్వూ తీసుకోవాలి . చెల్లక పోవటం అంటే ఏమిటి ? నేనిస్తే నువ్వు తీసుకోక పోవటం . నువిస్తే ఇంకోరు తీసుకోరు అన్న భయమే కదా ? " అని ఎన్నో వివరణలు ఇచ్చి " నోటు తీసుకోను అనటం నేరం " అని కూడా భయ పెట్టాను .

అతడు ఐదు రూపాయల బిళ్ళ-ఐదు రూపాయల ఒక్క పొడి పొట్లం ఇచ్చి వేసాడు .  అదుగో అక్కడ నుంచుంది చూశారూ -- ఆ ముసలి బిక్ష గత్తెకు ఇద్దామనే ఈ ఐదు రూపాయల బిళ్ళ సంపాదించాను. అంతే గానీ ఫది రూపాయల నోటును వదిలించు కుందా మనైతే కాదు . అది తీసుకు వెళ్లి ఆమెకు ఇస్తే ఆమె  " ఐదు రొప్పయల కేమొస్తుంది ? ఓ ఇరవై ఇవ్వండి " అన్నది .

అప్పుడు నేను ఆమెతో " ఐదు రూపాయల కు ఏమీ రాక పోవటం ఏమిటి ? చిప్స్ పాకెట్ వస్తుంది . ఐదు రూపాయల కు ఓ  చిప్స్ పాకెట్ ను అమ్మటానికి కోట్లు ఖర్చు పెట్టి పరిశ్రమలు నడిపిస్తూ వున్నారు . ఆ ఐదు రూపాయలలో ఎదో లాభం రాకపోతే వాళ్లెందుకు చిప్స్ తయారీ చేసి అమ్ముతున్నారు ? అందు వల్ల ఐదు రూపాయలకు ఏమీ రాదు అనవద్దు . వారికొచ్చినట్లు నీకూ కూ ఎంతో కొంత లాభం వస్తుంది ఇలా ఐదు ఐదు జమై అవి ఏ   వంద అవుతావి   " అని నేను ఆమెకు నచ్చ చెప్పాను.

ఆమె నా నచ్చ చెప్పుడుకు అంగీకరించి ఆ ఐదు రూపాయల బిళ్ళని జోలెలోకి వేసుకుంది .

గాడ్ ఫాదర్ నవలలో ' రీసన్ విత్ పీపుల్ " అంటే "కారణ పూర్వకం గా "మాట్లాడండి . అది మీకు మిమ్ముులను ఉన్నత శిఖరాలను అందుకునేలా చేస్తుంది  అని చెపుతాడు దాని రచయిత . నేను ఇద్దరితో రీజనింగ్  చేసి గెలిచాను .

నేనుఉన్నత శిఖరాల మీదకు పోయే దారిలో వున్నానని నా మీద  నాకు డౌట్ వచ్చింది .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ

————————————————————————

10.యుద్ధము లో  ? కొన్ని మార్కులు ?. 30-9-24

యుద్ధము అంటే ఏమిటో అందరికీ తెలుసు . బాంబులేసు కుంటారు . కొందరు జనం,  కొందరు సైనికులు సింపుల్ గా చచ్చి ఊరుకుంటారు . యుద్ధములో చని పోని ప్రజలు అనగా పిల్ల జెల్లా, ముసలి ముతక , సైనికులు త్రీవ్ర గాయాలతో హాస్పిటల్స్ పాలు అవుతారు . ఇవాళ వందమంది క్షత గాత్రులు హాస్పిటల్ లో చేరితే రేపు ఇంకో వంద మంది హాస్పిటల్ లో చేరుతారు . దీనితో హాస్పిటల్ లో డాక్టర్ల కొరత - బెడ్ల కొరత ఏర్పడుతుంది .ఇప్పుడే యుద్ధము తాలూకు అసలు విషాదము మొదలు అవుతుంది .

వైద్యుడు నారాయణుడే అయినా కానీ ఆయనకు కూడా ఒక లిమిట్ మొదలవుతుంది . అయన గాయ

పడిన వారిలో ఒక్కొక్క రినీ  పరిశీ లిస్తూ - ఒక్కొక్కరికీ మనసులోనే మార్కులు వేసుకుంటూ పోతాడు . వైద్యము చేసినాక తప్పని సరిగా బ్రతుకుతాడు, తిరిగి  దేశానికి ఉపయోగ పడతారు అనే ఆలోచన  ప్రాతి పదికన -- సైనికులను / వ్యక్తులను  / పిల్లలను గుర్తించి వారికి ఎక్కువ మార్కులు వేసుకుంటూ పోతాడు  . ఉదాహరణకు 99 నుండి మొదలు పెట్టి 01  దాకా వేసాడు అనుకుందాము .  ఆ తరువాత 99 , 98 , 97 , 96 , 95 మార్కులు పొందిన వారికి హాస్పిటల్ వారు మొదటి ప్రాధాన్యతలో అత్యవసర , వైద్యము అందిస్తారు . 94 ,93 ,92 , 91 ,90 మార్కులు పొందిన వారి వంతు ఆ రోజు మధ్యాన్నానికి రావచ్చు ,లేదా  రేపు ఉదయానికి రావచ్చు - లేదా ఎప్పటికీ రాక పోవచ్చు . ఎప్పటికీ రాక పోవటం అనేది ఎట్లా జరుగుతుంది ? అంటే 99 , 98 , 97 , 96 , 95  మార్కులు పొంది న వారికి వైద్యం జరుగుతూ ఉండగానే  - బాంబు బారిన పడిన ఇంకో వందమంది హాస్పిటల్ కి రావచ్చు . వారిలోని మరి కొందరు మళ్ళా 99 , 98 , 97 , 96 , 95 మార్కులకు అర్హులు కావచ్చును  .

చివరికి తెలుసు కోవాల్సింది ఏమంటే ?
యుద్ధములోగాయ పడి నాక  హాస్పిటల్ లో చేరిన వారికి ఏ సీరియల్ నెంబర్ వర్తించదు . భగవంతుడు వారు బ్రతకటానికి ఇచ్చిన అవకాశాలే వారి పట్ల మార్కులుగా  మారి - దాని ఆధారంగానే  వైద్యము అందుతుంది .
94 ,93 ,92 , 91 ,90 మార్కులు వచ్చిన వారి కె వైద్యము అందే పరిస్థితులు నామ మాత్రంగా ఉండగా - 60  నుండి 35  మార్కులు పొందిన వారి పరిస్థితులు ఏమిటో ఆలోచించండి? . వారు--  వారి బంధువులు చావుకోసమో,  బ్రతుకు కోసమో ఎదురు చూస్తూ యుద్ధము అనేది  మిగిల్చే విషాదము అనుభవిస్తూ వుంటారు .

ఇజ్రాయిల్ - హమాస్ మధ్య  యుద్ధము , రష్యా ఉక్రేన్ మధ్య యుద్ధము నేపధ్యము లో వెలువడిన ఒక డాక్యుమెంటరీ ఆధారంగా ఇది రాసాను .

మహా శివుడు సతి ని భుజాన వేసుకుని భారత ఖండమంతా తిరుగగా , సతి యొక్క శరీర భాగాలూ అనేక చోట్ల పడి అష్టా దశ శక్తీ పీఠాలు వెలిశాయని పురాణాలు చెపుతాయి . ఈ నేపధ్యమును పట్టి - భార్య యొక్క మరణపు దుఃఖము పరమ విరాగి ఐన శివునికి కూడా భరింపరానిదే అయి వుంది . ఇక మానవ మాత్రుల సంగతి ఏమని చెప్పగలము ? శివుడు దేశము అంతా తిరిగి అష్టా దశ శక్తీ పీఠాలను ఎందుకు కల్పించాడు ? ఎందు కంటే సతి లేని తన దుఃఖాన్ని తన వారందరూ గ్రహించాలని, తన దుఃఖాన్ని తన జనులతో పంచు కోవాలనీ ను . కానీ జనులు వేరొకరి దుఃఖాన్ని తమది గా చేసుకోలేరని / పంచుకో లేరని , గట్టిగా మాట్లాడితే అసలు పట్టించుకోరని - వాళ్ళ పూజలేమిటో వాళ్ళ కోరికలేమిటో వాటికే తొలి ప్రాధాన్యత అని తెలుసుకోలేని వాడు అయినాడు ఆ భోళా శంకరుడు .

అష్టా దశ శక్తీ పీఠాలనూ కైలాసం లో నుండి చూస్తూ - తనలోని దుఃఖము రూపు మాసి పోకుండా వుంచు కోవాలన్న ఆలోచన తోనే ఆ విస్వేస్వరుడు అష్టా దశ

శక్తీ పీఠాలను కల్పించాడేమో ? అనుకుంటే -- కొన్ని దుఃఖాలు కాలం తో పాటుగా కనుమరుగు అయి పోగూడదని అయన కోరుకున్నాడని మనము గ్రహించుకోవాలి. అష్టాదశ శక్తీ పీఠాలు అనే మఋపుకు రాని దుఃఖ చిహ్నాలని ఏర్పరిచి శివుడు తన సతి పట్ల ఒక గొప్ప నివాళి ఇచ్చాడు అని వూహిద్దాము . కొన్ని దుఃఖాలు ముఖ్యంగా భార్య వియోగ దుఃఖము కలకాలం వుండేది మరియూ ఉండ తగ్గది, మరియూ వుండేటట్లు ప్రోత్సహించుకో తగ్గది . అర్ధాంగి విడిచి పెట్టి వెళ్లిన దుఃఖాన్ని మరుగున పడేసుకునే ప్రయత్నం చేయటం మానవత్వం కాదని ఆ మహా శివుడే మనకు ఆచరించి భోదించారని నేను గ్రహించాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి ఆన్ 30 -09 -24

—-----------------------------------------------------------

9.శివుని కుమార్తెలు .                26-09-24

శివునికి - జయ.   విషర్ ,  షామ్లిబరి.   దేవ్ ,  దొట్లీ అనే పేరుగల ఐదుగుగురు కుమార్తెలు వున్నారు. వీరు జన్మించినపుడు నాగు పాముల రూపములో వున్నారు .  ఇంటికి ఆడ పిల్ల లేని లోటును జానపదులు భరించలేరు . వారు తమ ఊహాశక్తితో ఈ రూపాలను సృష్టించి శివుని ఇల్లు తమ ఇంటి  వాలే ఆడపిల్లలతో కళకళ లాడేదని చెప్పదలుచు కున్నట్లు మనం భావించాలి .

"జయ"  శివుని నవ్వు నుండి పుట్టింది . సరస్వతి దేవి వంటి  గుణాలను కలిగి ఉంటుంది . సరస్వతీ దేవి లౌకిక విద్యలను ఇస్తే ఈమె  ఆధ్యాత్మిక  విద్యలు ఇస్తుంది .

"విషర్" అనే ఆమె లక్ష్మీదేవి  వంటి గుణాలను కలిగి ఉంటుంది . ఈమె భౌతిక  సంపదలు కాక ఆధ్యాత్మిక సంపద లు ఇస్తుంది  .

"షామ్లిబరి "పార్వతీ దేవి యొక్క ప్రతి రూపము . తల్లి గుణాలను ప్రతిబింబిస్తుంది

"దేవ్" అనే ఆమె గంగకు పుత్రిక . సాధకుల హృదయాలకు స్వచ్ఛత ను సమకూర్చుతుంది . గంగను శివునికి పత్ని గా - చేసి కొందరు జానపదులు పాటలు అల్లారు . ఇదే వరవడిలో గంగకు ఈ పుత్రిక జనించింది .

"దొట్లీ " అనే ఆమె శివునికి యమునా నదికి కూతురు . ఆ నది యొక్క సుగుణాలను ప్రతిబింబిస్తుంది .శివుడు గంగకు పతి . భారత దేశపు  నదులన్నీ గంగా రూపాలే . గంగకు పతి ఐన శివుడు భారత దేశపు నదులన్నింటికీ భర్త స్థానము పొందు తాడనే జానపదుల తర్కం ఇందులో గమనించాలి .

ఇంకొందరి ఊహల ప్రకారం  శివునికి ముగ్గురే కుమార్తెలు అని కూడా వుంది . అందులో ఒకరు" అశోక సుందరి", రెండో ఆమె "జ్వాలా ముఖి" మూడవ ఆమె "మానస దేవి "

స్కందుడు అనగా కుమార  స్వామి పెండ్లి చేసుకొని భార్య సమక్షాన కాలం గడుపుతూ ఉండటం తో - ఏమీ తోచని పార్వతీ దేవి - తనకు ఓ కూతురు కావాలని శివుని అడిగింది .వీరు ఇద్దరూ కలిసి కల్పవృక్షము వద్దకి వెళ్లి కుమార్తె నిమ్మని అడగగా - వీరికి అశోక సుందరి జనమించింది . అశోక సుందరి పేరు పద్మ పురాణములో ఒక్క సారి కనపడుతుంది

జ్వాలాముఖి - --సతి యొక్క దేహము నేలపై చెల్లా చెదురుగా పడినపుడు,   నాలుక పడిన చోట  వెలసిన రూపము " జ్వాలా ముఖి" . ఒక స్త్రీ  కి  జన్మించినది ఏదైనా ఆమె కు  పిల్లయే అవుతుంది కదా ? అనే ఓ లాజిక్ ను ఇక్కడ జానపదులు వాడారు . శివుని పతి ఐన  సతి దేహము  నుండి జనియించిన రూపము కాబట్టి - జ్వాలాముఖి    శివునికి కూడా కుమార్తె అని చెప్పుకున్నారు .

"మానసా దేవి"  బెంగాలీయుల దేవత . పార్వతీ దేవి తనకు నిరంతర పూజలు జరగాలి అనే "మనసు" లో

కోరుకున్నది . పార్వతీ దేవియొక్క మనసు భూలోకము వచ్చి పార్వతీ దేవి మనసును భూలోక వాసులకు తెలిపింది . మనస్సు అనేది పార్వతి నుండి వుద్భవించింది కాబట్టి ఈమె పార్వతి లోని ఒక భాగము. తల్లి నుండి జన్మించినది పిల్లయే అనే లాజిక్ ప్రకారం    ఈమె పార్వతికి పుత్రిక - ఆ వరుసలో ఈమె శివునికి కూడా పుత్రికయే .

పై రూపాలు  అన్నీ భక్తుల మానసిక ఉల్లాసానికి కల్పించినవే . శివ  భక్తితో కధలు అల్లినవారు ఈ రూపాలను సృష్టి చేశారు . ఆడపిల్లలు లేని ఇంటికి శోభ లేదు అనే ఫీలింగ్ తోకూడా ఈ రూపాల సృష్టి జరిగిందని అనుకోవచ్చు .   వీరు పురాణాలలో ఉదాహరింపబడిన దేవతలు కారు .  అలా ఐయి ఉంటే వీరికి కూడా ఆలయాలు ఉండి  ఉండేవి ..శివాలయాలలో నాగ పడిగల ప్రతిష్ట చేస్తూ వుంటారు. ఆ నాగ పడిగలు అయన కుమార్తెలు వున్నారు అనే దానికి  గుర్తులు అయితే కావచ్చును . శివుని పైన వస్తున్న అనేక టీవీ ధారావాహికలు శివునికి

కుమార్తెలు ఉన్నట్లు సూచిస్తూ ఉన్నందున శివునికి కుమార్తెలు కలరని జనం నమ్ముతూ వున్నారు .
నిప్పు లేనిదే పొగ రాదు అన్నట్లు - అశోక సుందరి అనే ఆమె శివుని కుమార్తె గా  పద్మ పురాణం లో పేర్కొన బడినాక  అదే కోవలో మిగతా కుమార్తెలు కల్పించ బడినారు .
శివుని కి కుమార్తెలు వున్నారని మొదటి సారిగా విని పై విషయాలు సేకరించాను .

వారణాసి -- ఉమా  శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి రచన

ఎవరికి చెప్పుకోనూ ? ఏమని చెప్పుకోనూ ? అని ఆలోచిస్తూ - నా ప్రాణం లో ఒక ప్రాణం , మా ఇంటి వెలుగు ,నా భార్య అయినా వారాణసి ఉమా దేవి **11 -09 -24** న మా ఇంటి నుండి దివి కి వెడలి పోయింది .ప్రతి మనిషి కోసం పాడ దగ్గ ఓ విషాద గీతము ఒకటుంటుంది అని పాశ్చాత్యులు అన్నారు . ఈమె కోసం ఒకటి కాదు వంద విషాద గీతాలు సృష్టించి పాడాల్సి వున్నదని ఆమె భర్తగా నా అభి ప్రాయము. ఆమెమా పెళ్లి చూపుల్లో నా ఎదురు గా కూచుని " నన్ను కాదని ఎవర్ని చేసుకుంటావు ? నీ వల్ల అవుతుందా ? అన్నట్లు చూసి కూచుంది . ఈ చివరిలో "నేను లేక పోయినా బ్రతకటం నీవల్ల అవుతుందా " అని - ప్రశ్నించకుండానే వెళ్లి పోయింది .

**Suddenly died due to massive heart 💖 stoke**

8. మేము రైతులోల్లం. 27-08-24

ఒక తెల్లవారు ఝామున - మన సారు - కారు నడుపుకుంటూ -- రోడ్డుపక్క మాగాణి పొలాలలోకి దూసికెళ్ళి - మోకాలి లోతు బురదలో ఆగాడు . కారు -- కారులో ని ఆయన భార్య పిల్లలు - అయన అందరు క్షేమమే. కారు రోడ్డుమీద లేదు - అదొక్కటే తేడా .

అప్పటికే పొలంలోకి దిగి ఎదో పనులు చక్కపెట్టుకుంటున్న మన రైతు - కారు దెగ్గరికి లగెత్తుకుని వచ్చాడు.

అప్పుడు సారు కారులోంచి - ధైర్యంగా బయటకి దిగాడు . కారుని బయటకు తీసే విధానం మీద చెర్చించుకున్నారు . మన సారు , ఐదారు వేలుఖర్చు అయినా సరే ,ప్రొక్లైనర్ని , లేదా ట్రాక్టర్ని పిలిపించి - కారు బయటకి లాగిద్దాం - ఎవరన్నా ఉంటే చూడన్నా " అన్నాడు.

" ఎందుకండీ? మాకు ఒక దున్నపోతుంది . దాని మెడకీ - మీకారుకి ఒక తాడేసి లాగిద్దాం. కారు బయటికి వస్తది . కాదంటే అప్పుడు చూదాం. నాకేదన్న ఒక రెండు వెయ్యి రూపాయలు ఇప్పించండి " అని బ్రతిమాలుకున్నాడు . అయన ఒప్పుకున్నాడు

రైతు దున్నపోతును తెచ్చాడు - సారు కారు లో కూచొని ఇంజిన్ ఫస్ట్ గేర్ లోకి వేసాడు . బాగా థ్రస్ట్ ఇచ్చాడు . ఎడ్వెంచర్ ఫీల్ అవుతూ అయన భార్య, పిల్లలు కారుని తోశారు - . రైతు దున్నను కొమ్ములు పట్టి - లాగుతూ దారి చూపిస్తూ - కారుని గట్టు మీదకు తెచ్చాడు . ఇక వాళ్ళ దారిన వాళ్ళు పోవచ్చు . అప్పుడు సారు రైతు చేతిలో ఓ వేయి రూపాయలు మాత్రం కుక్కి " ధర్మరాజు కి అన్న లాగా , న్యాయంగా ఇచ్చాను . అత్యాశ మంచిది కాదు " అన్న ఫీలింగ్ ముఖంలో చూపెట్టి - మాట్లేవీ లేకుండా .. అద్దాలు మూసేసి కారు ముందుకు దూకించాడు .

ఆ వెయ్యి అందుకుని. కారుకు  నమస్కారం చేసుకుని - ఆనందంగా బై బై చెప్పాడు రైతు.

రైతు భార్య కూడా రైతుతో పాటు పొలం వచ్చి వుంది . దాని పేరు ఎర్రి ముఖం .      " ఏందయ్యా ? కారు ఆయన్ని అట్ట పోనిచ్చినావు. రొండు వేలు ఇచ్చిందాకా కారుకు అడ్డం పడక పోతివా ?  ఓడ దాటినా దాకా ఓడ మల్లయ్య.. ఓడ దాటినాక బోడి మల్లయ్య లెక్క చేస్తారు ఈ సారులు .." అని రుసరుసలాండింది.

" ఓసి ఎర్రి ముఖమ .. సార్ల సంగతి నాకు తెలీదా ఎట్టా ? దున్నపోతుని  కారుకి కట్టి లాగిపిస్తే - ఆ కారు లాగలేక - మన దున్న కాళ్ళు విరుచుకుంటే ? ఎవరొచ్చి మనను ఆదుకుంటారు? అందుకని , బాగా పాతపడి - ఊరికూరికే పుటుక్కున తెగిపోతున్న తాడు ఒకటి  దున్నకి - కారుకి కట్టాను . నిజంగా కారు ని దున్నే లాగివుంటే తాడు పుటుక్కున తెగి పోయేది. (రైతు ఉద్దేశంలో - తాడు వంద కేజీల మించి న బరువుకి ఆగదు)  ఆయనగారి పిల్లలు తోశారు - అయన ఇంజిన్ ఎగదోశాడు .. మన దున్న ఆయనకి ఎంకరేజ్మెంట్, నేను మానసిక ధైర్నం ఇచ్చినం . అయన సొంత బలంతో - సొంత  బలగంతొ , సొంత ధైర్నం తో  గట్టున పడ్డాడు . కష్టం అయన పడి - డబ్బు మన చేతిలో ఎట్టి - పారిపోయినాడు . అట్ట గాకుండా - రొండు వేలు చేతిలో పెట్టి ఉంటే - " మాకెందుకు సారు డబ్బులు. ఎదో నోటి తుత్తరాకి అడిగినాను . సాయానికి వచ్చి డబ్బు గుంజేటోల్లం కాదు . మేము రైతులోల్లం. క్షేమంగా ఎల్లేసి రండి " అనే వాడిని. ఆయన రొండు వేలూ

ఆయనకే ఇచ్చే వాడిని .డబ్బుకోసమని అందరూ చెడుతుంటే - వాళ్ళని చూసి   నాకూ అలాగే చెడాలి అనిపిస్తది. కానీ  కానీ నేను రైతు జన్మ ఎత్తిన "ఆలాంటి పనులు ఈ జన్మలో చేయలేను .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ
ఇంకో నెక్స్ట లో వస్తది - నందీశ్వరన్ స్టయిలే పేరు అన్న కథ

7 నందీశ్వరన్ స్టైల్ ఏ  పేరు 29-08-24

కొండ కు ఈవలాగా  ఒక అరయెకర పొలం కొని - దానికి పక్కనే వున్న కొండ పోరం బోకు   భూమిని కబ్జా చేసి అపార్టుమెంట్లు కట్టేస్తున్నాడు  -సత్తెయ్య గారు .
ప్రొక్లెనర్ తో పోరంబోకు భూమిని ని చదును చేస్తూ ఉండగా - పెద్ద గుమ్మడికాయంత నందీస్వరుడి విగ్రహం  ప్రొక్లెనర్కి చేతికి దొరికింది . సత్తెయ్య గారు ఎంతో  ముందు చూపుతో - ఆ విగ్రహాన్ని - ప్రొక్లెనర్ చేత ముక్క చెక్కలు గా తొక్కించి " నోట్లో వక్క పలుకు వేసుకుని ఫటుక్కు మనిపించినట్లు అంతా కామ్ గా చేసేసాను  " అనుకున్నాడు . ఒకనాడు సత్తెయ్య గారు తాను కట్టిన మొత్తం వంద అపార్టుమెంట్లు కట్టి అమ్మకానికి పెట్టాడు . "రేపు అమ్మకాలు  మొదలు " అనగా ఆ నాటి రాత్రి నందీశ్వరుడు సత్తెయ్య గారికి గాలిలో కనపడ్డాడు . " ఆ భూమి ఎవరిదీ అనుకున్నావు ?' అని  సత్తెయ్య గారిని  గద్దించి మరీ అడిగాడు . " నాది .అలాగని  కాగితాలు కూడా పుట్టించాను " అన్నాడు సత్తెయ్య ధీమాగా. నందీశ్వరుడి స్టైల్ ఏమిటో ఈయనకు తెలీదు

అందుకని కాగితాల ధైర్యం చూసుకొని జంకూ గొంకూ లేని సమాధానము చెప్పాడు . నంది బుసకొట్టాడు . అప్పుడు నంది యొక్క రాతి ముఖము నుండి తెల్లని పొగవంటి గాలులు బయటికి వచ్చాయి . కళ్ళు పసుపు రంగులో వెలిగాయి . అందులోనుండి ఎర్రని లేజర్ కిరణాల వంటివి వచ్చి సత్తెయ్య గారి పక్కటెముకలను తాకాయి .
సత్తెయ్య గారు నిద్రలేచి " రాత్రి ఎదో భలే కల వచ్చిందే " అనుకోగానే ఆయనకు
చంకలలో ఎదో మేకు దిగ వేసినట్లు - నెప్పి స్టార్ట్ అయ్యింది . ఈ నొప్పికి మందు లేదని మూడు నెలల తరువాత తేల్చి చెప్పారు డాక్టర్లు .

" నందిని పట పట లాడించి ఎదో తప్పు చేసానా ? లేక భూమి ఏ దేముడిదో అయితే అది నాది చేసుకొని తప్పు చేసానా ? అని సత్తెయ్యగారు ఆలోచనలో పడ్డాడు .
ఈ లోచన తరువాత నంది మళ్ళీ వచ్చి సత్తెయ్యకు కనపడి "'ఆ భూమి నీది కాదు - నాది. నువ్వు అక్రమించుకుని --నీది అన్నావు . ఆ నేరానికి గానూ నీ అపార్ట్మెంట్స్ ని కాస్ట్ టూ కాస్ట్ సేల్స్ చేయి . నాప్రీత్యర్ధం ఆ ధర మీద 20 % డిస్కౌంట్ ఇస్తే నీ చంకల్లో నొప్పి పోతుంది" అని మాట ఇచ్చాడు.

సత్తెయ్య గారు తాను మొదటిలో 50 లక్షలు చెప్పిన అపార్ట్మెంట్ ధరను ఇప్పుడు

30 లక్షలు చెప్పాడు . ఈ ధరలో ని తగ్గు దలని చూసి ఒక రాజకీయ రౌడీ ఉత్సాహం పొంది సత్తెయ్య గారిని కిడ్నప్ చేసి ఆ వంద ఎపార్టుమెంట్లు తానే కొని మళ్ళీ ఒక్కొకటి 50 లక్షల చొప్పున అమ్మకానికి పెట్టాడు . ఆ రాత్రి నంది వచ్చి రాజకీయ రౌడీ గారికి దర్శనం ఇచ్చి అయన గజ్జల్లో మేకు గుచ్చిన నొప్పి తెప్పించాడు . తన బదులు ఎవడు లాభపడతాడో చూద్దామని సత్తెయ్య గారు అన్నీ గమనిస్తూ నే వున్నాడు . .రాజకీయపు రౌడీ హాస్పిటల్ కి తిరిగీ తిరిగీ - దిక్కూ దారీ తోచక- చివరికి ఎప్పుడో సత్తెయ్యగారి సలహా పొంది - దాని ప్రకారం "నందీశ్వరుడి" శరణు కోరాడు.

" కాస్ట్ టూ కాస్ట్ సేల్స్- మీద 20 %డిస్కౌంట్ ఇచ్చి బడుగు ప్రజలకు అపార్ట్మెంట్స్ అమ్ము నొప్పి పోతుంది " అని నంది వాక్కు ఇచ్చాడు .

రాజకీయ రౌడీ గారు అపార్ట్మెంట్ ఒక్కటీ 20 లక్షలకు అమ్మాడు. అప్పుడు నొప్పి పోయి ఊపిరి పీల్చుకున్నాడు .

20 లక్షలకు కొనుక్కున్న బడుగు జనం లో ని కొందరు కొన్నాళ్ళు ఉండి తమ అపార్ట్మెంట్స్ ఒక్కోటి 40 లక్షలకు అమ్మ కానికి పెట్టారు- లాభాలు చూద్దామని . వీరికి కూడా నందీశ్వరుని దర్శనం ఇచ్చాడు . వారందరికీ మెడ లో మేకులు దిగినట్లు - వెన్నులో బాకులు దిగినట్లు నొప్పులు వచ్చాయి . సత్తెయ్య గారికి ఈ విషయాలు తెలుసుకుంటూనే వున్నాడు కదా ? అయన సలహా మేరకు బడుగు జనం నందీశ్వరుని శరణు వేడారు. " కాస్ట్ టూ కాస్ట్ సేల్స్- మీద 30 %డిస్కౌంట్ ఇచ్చి కటిక పేద ప్రజలకు అపార్ట్మెంట్స్ అమ్మండి . నొప్పి మాయం ఐ పోతుంది.

అమ్ముతాము అన్నాక,  అమ్మాల్సిందే.కానీ  మేమె వుంచుకుంటాము అంటే నడవదు . మీ బుద్ధులు కుక్కతోక వంకరలు. మేము అమ్మము   అనిమీరు  మొరాయిస్తే మీ నొప్పులు పోవు  " అని నంది వాక్కు ఇచ్చాడు .
వారు  అపార్ట్ మెంట్లు 10 లక్షలకు అమ్మారు . అవి కొనుక్కొని కాపురాలు పెట్టు కున్న కడు పేద ప్రజలు  నిత్యకల్యాణం పచ్చ తోరణం అన్నట్లు ఆ ఇండ్లలో బ్రతి కారు .  వీరిలో కూడా ఎవరన్నా తల ఎగురవేసి " నాది నా ఇష్టం వచ్చినట్లు అమ్ముకుంటాను " అనుకోగానే వారికి --  చెవుల్లో మేకులు దిగినట్టు నెప్పులు వచాయి . వీరు నంది ఆజ్ఞమీద వారు వారి అపార్టుమెంట్లను ఐదు లక్షలకు అమ్మి  చెవి పోటునుండి బయట పడ్డారు.
సత్తెయ్యగారు ఇప్పుడు సాధు పురుషుఃడు అయినాడు . ఓ నాడు నందీశ్వరుని ధ్యానించి అయన దర్శనం పొంది "ఎందుకిలా చేస్తున్నావు నందీశ్వరా ? " అని అడిగాడు సవినయంగా .
నంది ఇట్లా అన్నాడు " ఎవరైనా కానీ నా భూమిని తమ నివాసానికి వాడుకోవాలె తప్ప వ్యాపారానికి వాడుకో కూడదు అని నా షరతు "

"ఇది నీ భూమి ఎట్లా అవుతుంది ?కాగితాలలో ఎవరిదో అగ్న్యాత బ్రాహ్మడిది అని రాసి ఉంటే అది నాది అని రాసాబు "   అన్నాడు సత్తెయ్య భయం భయంగా .

"ఓరే అజ్ఞానీ -- నువ్వు ఎపార్టుమెంట్లు కట్టిన భూమి - రైతులు తమ ఇంట్లో చని పోయిన ఆవులను - ఎడ్లను భక్తి శ్రద్ధలతో పాతి

పెట్టటానికి వాడుకునే దాని కోసరమని . నువ్వన్న ఆ అగ్న్యాత బ్రాహ్మణుడే మాకు కేటాయింపు చేసాడు .అందువల్ల అది మా భూమి . నేను వారి పెద్దను " అన్నాడు .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క స్వంత కథ

----------------------------------------------------------------

6 ధర్మ ప్రచారక్- 25-08-24

" ఏమయ్యా బావా .. వారు పిల్లనచ్చింది అన్నారు . మనపిల్ల కూడా వారు నచ్చారు అనే అన్నది . అందరికీ ఆమోదంగా వుంది . వారికి " మాకు కూడా ఇష్టమే " అనే కబురు చెప్పనా ?

"తొందర పడద్దు . తల్లి తండ్రులకు ఒక్కడే పిల్లవాడు అంటుంటువి . రేపు వారు పోయి ఏ హాస్పిటల్ లో పడ్డా --సోలో--గా ఇతడే చూసుకోవాలి . అప్పుడు అంతలా తల్లి తండ్రుల భాద్యతలను నెత్తిన వేసుకోకు అని చెప్పటం మనకు ధర్మం కాబోదు .మనం ధర్మ హీనులం అయిపోతాము . అందువల్ల కనీసం ఇద్దరు కొడుకులు వున్నా వారికి అందులో చిన్న వాడికి నీ పిల్లని ఇస్తే బాగుంటుంది . అప్పు డైతే మనము " పెద్ద వాడు మీ అన్న ఉండగా నీ తల్లి తండ్రుల భాద్యత నీకేమి ఉందట ? అని ధర్మము బోధించటానికి వీలుంటుంది ."
" బావా అంతే నంటావా ?'
"మీ సుఖాన్ని మీ పిల్ల సుఖాన్ని కూడా దృష్టిలో పెట్టుకోవాల్సిన ధర్మము నీ కున్నది . ఇదే అసలు ధర్మము "

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క స్వంత రచన

5 హ్యాపీనెస్ టీచర్స్ 24-08-24

నిన్న ఒక అంతర్జాతీయ టీవీ ఛానెల్ లో ఓ విశ్లేషణ వచ్చింది . నేడు మనము చూస్తున్న సోషల్ మీడియా { ఫేసుబుక్ యు ట్యూబ్ ఇన్స్టా వంటివి } నేటి తరం పిల్లల పట్ల హ్యాపీనెస్ టీచర్స్- అనగా , సంతోషంగా కాలం గడుపు అని భోదించే గురువులు గా వుంటున్నవి అని ఈ కార్యక్రమంలో విశ్లేషించారు .

ఏ సోషల్ మీడియా కి ఐనా పెద్దలు వుంటారు . డబ్బు సంపాదించటమే వారి అంతిమ లక్ష్యం .ఎదుటివారికి హ్యాపీ నెస్ అమ్మి డబ్బు సంపాదించటమే వీరు చేసే పని . .వీరు హ్యాపీ నెస్ కాక మనకేమి అమ్ముతున్నారు ? అని ఆలోచించండి

పిల్లలు తమ చాకెలెట్ ను వదలనట్లు నేటి పిల్లలు /యువత తమ హ్యాపీ నెస్ గురువుల ని వదలటం లేదు .వారి గురుభక్తి అధికం అయిపోతూ వున్నది . చిన్నపిల్లలు ఫోన్లలో చూస్తూ భోజనాలు చేయటం లోని కారణం - వారు ఈ హ్యాపీనెస్ అనే మత్తు ముందుకు అలవాటు పడి ఉండటమే .

పిల్లలు మరియూ యువత హాపీ నెస్ తో పెరుగుతూ ఉంటే మంచిదే కదా?

అన్న భావము వ్యక్త మైంది .  ఇందులో ఏమి మంచి వుంది  -
ఏమిలేదు
అన్న విషయంపై మానసిక శాస్త్రవేత్తలు ఆలోచిస్తూ వున్నారు .
ప్రస్తుతానికి ఈ హాపీ నెస్ ప్రభావం ఇలా ఉండవచ్చు నని
ఊహించారు .
"మనం నిరంతరం హ్యాపీ నెస్ లో ఉన్నామని  -
UNHAPYNESS అనేది లేకుండా ఎక్కడికి పోతుంది ?
ఎక్కడికీ పోనీ ఈ UNHAPYNESS  ని ఎదుర్కోవాల్సి న
సమయం వచ్చినపుడు నేటి పిల్లలు /యువతరం  నిప్పు కోడిలా
ముఖం చాటేసి చతికల పడి కూచుంటారు  ? . ఏ బరువూ
భాద్యతలగురించి  ఆలోచించరు - వాటిని స్వీకరించరు . తమ
కుటుంబ సభ్యులను అనారోగ్యాలనుండి , ఆపదల నుండీ  రక్షించే
ఆలోచన చేయక - చంటి పిల్లలు పాల పీకను చప్పరిస్తూ
కూచునట్లు ఫోన్ చూస్తూ కూచుంటారు . పిల్లలకి మనకన్నా వారి
టీచర్ ఏ గొప్ప అని మనకు అనుభవ పూర్వకంగా తెలుసు .
ఇకముందు ఈ  హాపీనెస్ టీచర్ లే పిల్లలపాలిట మీకన్నా మరీ
గొప్ప అవుతారు .ఇక ముందు తరం పిల్లలు అన్ని పనులూ తమ
హాపీనెస్ కోసమే మాత్రమే చేస్తారు . మీకోసం ఏమీ చేయరు .
చేయాలనే మనస్తత్వం కూడా కోల్పోతారు ".

రచన వివరణ వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

4 తీన్ మార్ - తీర్మానం      23-10-24

"ఏమండీ మన పెళ్లి చూపులపుడు ఏ చీర కట్టుకున్నానో మళ్ళా అదే చీర కట్టుకోమంటారా ? అన్నది ప్రమీల - భర్తతో కలిసి ఎదో పెళ్ళికి  వెడటానికి  రెడీ అవుతూ .
పెళ్లిచూపులనాడు తాను కట్టుకున్న చీర- తన అందాన్ని పెంచి -ఈజీగా లక్షమందినైనా  తన వైపు ఆకర్షించే  చీర అని ప్రమీల నమ్ముతూ ఉంటుంది .

" మన పెళ్లి చూపుల్లో నువు చీర కట్టుకున్నావా ? డ్రెస్ వేసుకున్నావు కదా ? అన్నాడు ప్రభాకరం .

" డ్రెస్ వేసుకుంది నా చెల్లి - దాన్ని లైకు చేసి నన్ను చేసుకున్నారా ?"

పై తరువాత ప్రభాకరానికి ప్రమీలకు ఆ  రాత్రి హోరా హోరీ యుద్ధము అయింది .  నోటి మాటగా విడిపోయి - ఆస్తులు పంచుకున్నారు .ప్రభాకరం కొన్న అపార్ట్మెంట్ ప్రమీలది అయ్యింది . ప్రభాకరానికి వాళ్ళ నాన్న ఇచ్చిన ఇల్లు దక్కింది . నిన్నరాత్రి నుండీ ఆ దంపతులు ఎవరింటిలో వారు ఉంటూ వున్నారు .ఒకరికొకరు అర కిలోమీటర్ దూరంలో .
మూడో  నాడు ప్రభాకరం ప్రమీల ఇంటి వైపు వచ్చాడు .
"ఎందుకొచ్చారు సిగ్గులేక " అని ప్రమీల ఈసడించింది .
"నీకోసం కాదు . నీ చెల్లె వచ్చిందని తెలిసి చూసి పోదము అని వచ్చాను " అన్నాడు ప్రభాకరం .

ప్రభాకరం మరదలు మరీ చిలిపి. ఆమె వచ్చి " బావా లేచి పోదామా అని మెసేజ్ పెడితేపే ? ఎప్పుడు ఎక్కడికి ఏ రోజు అనేది చెప్పా లేదేమి ? ఇప్పుడు పోదామన్న నేను రెడీ " అన్నది . ఆమె అట్లా ఎందుకు అన్నది అంటే ? బావ పెట్టిన చిలిపి మెసేజ్ మీద తన కౌంటర్ రిప్లై ఇవ్వటం ఇవ్వటంకోసం అని - కేవలం హాస్యం గానే అన్నది .
"నా చెల్లి వచ్చిందని ఈయనకు ఎలాతెలిసింది ? అదే చెప్పిందా ? వీరిద్దరి మధ్య నిజంగా ఎమన్నా ఉన్నదా ?అన్న ఆలోచనలలో పడ్డ ప్రమీల మనసు రగిలి పోతూ వుంది .

ఇహ ప్రభాకరం వైపు నుండి చూస్తే- భార్య చూడనపుడు మరదల్ని చూస్తూ " ఎం పిల్లో వెల్దామోస్తవ " అనే విప్లవ సాంగ్ ని హమ్ చేస్తూ నవ్వుతూ ఉంటాడు .ఇది రొటీన్ . కానీ ఆనాటి రాత్రి భార్యతో విడిపడి స్వేచ్ఛ పొంది న ఆనందంలో - మరీ సరదాగా ఫీల్ అయి " ఎం పిల్లో వెల్దామొస్తావా ? అన్న విప్లవ సాంగుని తన మరదలికి పంపాడు ." నాకు బాగా ఇష్టమైన పాట ఏదని అడుగుతుంటివిగా . విను అంటూ ." ఓ మెసేజ్ తో కలిపి ఆ పాట పంపాడు .ఈ మెసేజ్ లో తాను లోజికల్ గ సేఫ్ జోనులో వున్నానని ప్రభాకరం అనుకున్నాడు . ఆ సేఫ్ జోను ని బద్దలు కొట్టాలని అతని మరదలు అనుకున్నది .
ప్రమీల ప్రభాకరం చేయి పుచ్చుకుని " రండి అంతా మర్చిపోదాం " అంటూ ఇంట్లోకి స్వాగతించింది .
" మా ఆవిడా మంచి గా మారి పోయింది " అనుకున్నాడు ప్రభాకరం . తనను సిగ్గు లేనోడా అని నిందించింది అన్న సంగతి

కూడా మర్చి పోయేసాడు .స్త్రీలు గతం మర్చి పోలేరని గ్రహింపలేక పోయాడు .

భర్త చేయి పట్టుకుని అతన్ని ఇంటిలోకి నడిపిస్తున్న ప్రమీల మనసులో నే ఇట్లగ్గా ఓ తీర్మానం చేసుకొంది . " ఈ యనెను వదల కూడదు- ఎటూ పోనియ్య కూడదు- . మన బట్టలు లాండ్రీ లో బదులు మనింట్లో ఉంటే నే - ఎప్పుడు కావాలంటే అప్పుడు ఉతికి ఆరేసి ఎండపెట్టుకోవచ్చు ".

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత రచన

3 రుక్మిణీ వేదాంతం **22-08-24**

వారెవరో దివంగతులైనారని తెలిసి చివరి చూపులకు వెళ్ళాము .

"ఐదారు లక్షలు ఖర్చు పెట్టినా గానీ మనిషి దక్కలేదు " అని మృతుని కుమారులు అంటూ వున్నారు . తమ నిరక్ష్యని కి గురి ఐ ఆ మనిషి మరణించాడు అని మేము అనుకోకుండా ఉండేందుకు -- గానూ వారు ఆలా చెపుతున్నారా ? లేదా ఎందుకు చెపుతున్నారు అని ఆలోచనలో పడ్డ నాకు - వారికి ఏమని బదులు చెప్పాలో తొచ లేదు . నా పక్కనే రుక్మిణీ కూచుని వుంది .ఆమె ఇంటి పేరు వేదాంతం వారు .ఆపిల్ల గురించి నాకు అంత వరకే తెలుసు . కానీ ఆ అమ్మాయి ఇట్లా చెప్పగలుగును అని నాకు తెలీదు . కానీ ఆమె ఇట్లా చెప్పింది "

అంకుల్ అనారోగ్యాలంటే  పాల పొంగు లాంటివి . వైద్యం అనే నీళ్లు చల్లినపుడు అనారోగ్యం అనే పాల పొంగు తగ్గి పోతది .  కానీ  ఒక్కో సారి   పాలపొంగు ఫోర్స్ ఎక్కువగా ఉండి  స్టవ్ లు ఆరి పోయి మనకు మసి మిగుల్తాది . అట్లా అయ్యింది అనుకోండి . సింపుల్ గా ఉంటది . భాద పడద్దు " అని ఆయనతో  చెప్పింది .

" నిజమేనండి.  చిన్నదే అయినా చక్కగా చెప్పింది .ఇంతకు మించి ఎవరూ ఏమీ చెప్పలేరు గదా ?అనుకొని మీరు ఊరడిల్లండి భాద పడొద్దు " అని నేను వారికి చెప్పి ఊపిరి పీల్చుకున్నాను . మళ్లా కొశ్చన్ పడకుండా మాట్లాడటం ఓ కళ .రుక్మిణి వేదాంతం వారి ఇంటిలో పుట్టిన పిల్ల కాబట్టి  - ఇలాంటి వేదాంతం చెప్పింది అను కుందామా ? తేలిగ్గా ఐ పోతది .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

2  కల్పిత పాత్రలు      **21-08-24**

ఉదయం ఎనిమిది అవుతూ ఉండగా రైలు దిగి వారింటికి వెళ్ళాను .  కాఫీ కోసం నాలిక పీకుతున్నదని  వారింటికి వెళ్ళాను . ఉదయం ఫది లోపున వారింటికి ఎవరు వెళ్లినా కమ్మని కాఫీ ఇస్తారు . బంగారం లాంటి టిఫిన్ పెడతారు .

నేను తరచూ ఈ వూరు వస్తూ వుంటాను గానీ  మరీ తరచూ వారింటికి వెడుతూ వుంటుంటే ఆబోరు దక్కదని నేను నెల కొక సారి మాత్రమే  వారి ఇంటికి వెడుతూ వుంటాను .

ఇంటి అయన నాకు వేలువిడిచిన మేనమామ - అంతకన్నా ఎక్కువ లేదు .

వారిచ్చిన టిఫిన్ తిని కాఫీ తాగాను . ఆ పాత్రలు అనగా- ఆ కాఫీ కప్పు ఆ టిఫిన్ ప్లేట్ లు ఏవో వెరైటీగా వున్నాయి . ముడుపొచ్చినపుడు ఇట్లా లేవు . కాఫీ గిన్నె - ఫది సెంటీ మీటర్ల కొలతతో గంగాళం చేస్తే ఎలాగుంటుందో ఆలాగు వుంది . గంగాళని కి ఒకటే చెవు అంటే రింగు వుంది

ఇక టిఫిన్ ప్లేట్ చూస్తే అది చిన్న అట్లపేనం లాగున్నది. కానీ స్టైన్ లెస్ స్టీలు టిఫిన్ ప్లేట్ నే .దీనికీ ఓ రింగు వుంది .
" ఏంటి ఇవి ఈలాగు వున్నాయి ? ఎవరు ఎందుకు ఈలాగు కల్పించారు ?" అని నేను పైనం అడిగాను .

తన భార్య మాట్లాడక మునుపే -అయన ఏమన్నాడు అంటే "మేమా ఓపిక లేని పెద్ద వాళ్ళము అయి పోయాము .రైలు దిగి నేరుగా ఇంటికే వచ్చేవాబు ఎక్కువ అయ్యారు .తప్పేటట్లు లేదుగా అని అలోచించి ఈ కాఫీ గిన్నెలు - టిఫిన్ ప్లేట్ లకు ఈ రింగులు వేయించి డిజైన్ చేయించాము . ఈ పాత్రలు ఎక్కడ వున్నా సరే వాటిని మా కుక్కలు గానీ పిల్లులు గానీ వచ్చి ఈ రంగులను నోటిలో కరిచి పట్టుకొని లాక్కు వెళ్ళి ఓ మూలకు పెట్టె టట్లు ట్రైనింగ్ ఇచ్చాము - " అని చెప్పాడు . ఆ యమ్మ అనగా అయన భార్య అక్కడే నిలబడి వింటూ వున్నది .

" వాటి కేమిటి ప్రయోజనం ?"

" ఏముంటుంది ? ఫుడ్ అండ్ కాఫీ లే . మా పిల్లికి  కాఫీ అంటే చచ్చేంత ఇష్టం. మీరు తాగిన ఎంప్టీ కాఫీ పాత్ర చూసిందంటే దాన్ని పళ్లతో కరిచి పట్టి - ఓ మూలలకు లాక్కు పోయి -  నాలుక ఆడించి పాత్రలోని చివరి చుక్కను కూడా జుర్రేస్తుంది. పనిమనిషికన్నా ఎక్కువ శుభ్రం చేస్తుంది  . పిల్లి నాలుక . కుక్క నాలుకా మహా గరుకు .  ఇహ మాకుక్క కి ఏ టిఫిన్ అయినా ఇష్టమే . ఇప్పుడు మీరు తిన్న ఆ పెసర దోస పెట్టి ఇచ్చినప్లేట్ అన్నా అందులో మిగిలిన తుంపులన్నా దానికి   చాల ఇష్టం .ఇప్పుడో ఇంకాసేపటికో వచ్చి మీ టిఫీన్ ప్లేటు లాక్కువెళ్ళి మీరు మిగిల్చిందంతా ఊడ్చుకు తినే స్తుంది - "

" అంటే  గతం లో పిల్లులు కుక్కలు నాకిశుభ్రంచేసి  పాత్రలో నాకు కాఫీ టిఫిన్లు ఇచ్చారా ఏమిటి ? అని నేను నాలుక పీక్కున్నాను .వాంతి చేసుకుందామని ట్రై చేసాను

ఆయమ్మ జోక్యం చేసుకొని "నీకేగానీ--  ఇంకోరి కైనా గాని ఆలా ఇచ్చేది ఎలా ఉంటుంది?  " అదేం లేదబ్బా " అనింది.

" నేను నమ్మేది లేదు " అన్నాను

" లేదబ్బా - అయన నీమీద మజాకా చేస్తా ఉండేది అనుకో . ఇట్లా చెప్పితే జనం ఎట్లా స్పందిస్తారో ? మా ఇంటికి కాఫీ టిఫిన్లలోకి వచ్చేది మానుతారా? అనేది తెలుసుకొనేందుకు ఆయన అట్లా  కల్పించి చెప్తా టెస్టు పెడతా  ఉండేది ".అని ఆ యమ్మ అన్నది .

ఆ  పాత్రల ను చూసి  - ఆ యమ్మ- ఆ అయ్యా చెపుతూ వుండే దాన్ని నమ్మాలని నాకు అనిపించలా  .

వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

.

1.సుమంగళి సూట్స్   18-08-24

వీళ్లు  ఎవరబ్బా అని వాకిటిముందున నిలిచిన కారును చూసి ధింకో ధింకు  చేస్తుండగా అందులోనుండి  అంకయ్య అంకమ్మ అనే పుణ్య దంపతులు దిగారు .
అంకమ్మ కుపనిమనిషి  జీతాము ఇస్తాము. అంకయ్య ఆమెతో పాటు వచ్చి- ఒక బీడీ కట్టకు డబ్బులు తీసుకొని . మన బజారుపనులు  ఫ్రీ గా చేసిపెడతాడు.  వీరు మమ్మల్ని వీడి పోయే ముందు మాకు ఏమీ ఇబ్బందులు తల ఎత్తకుండా తగిన ఏర్పాట్లు చేసి మరీ హైదెరాబాదు వైపుకు మకాం మార్చారు .  ఈ కారణం తో వీరిని మేము పుణ్యదంపతుల లిస్టు లో పెట్టాము .

వారిని కూచోబెట్టి " కైసా చల్తా హయ్ జమానా ? అని అడిగాను .
"ఎదో మిమ్మని వదిలి పోయినందుకు బ్రతికి బాగు పడ్డా మానుకోండి  "సుమంగళి సూట్స్"అని ఎదో పెట్టుకున్నాము - హాయిగా సంపాదిస్తున్నాము " అన్నాడు అంకయ్య .
"సుమంగళి సూట్స్ న ? ఏవిటి వయ్యా అవి - చెప్పవూ ?"

" సార్ ఇప్పుడు ఏ వ్యాపారానికి ఐన విచిత్రమైన పేర్లు పెట్టటమే పెట్టు బడి. ఒకడేమో  కంది పచ్చడి - కోడి పులుసు హోటల్ అంటాడు . ఇంకోడు బిర్యానీ -పప్పు చారు హోటల్ అంటాడు  . ఇంకోడు "కుండలో అన్నము - ఉట్టి మీద పెరుగు -  మామగారి మాగాయ హోటల్"  అంటాడు - మాదీ అలాంటి దే కానీ అన్నాలు ఎట్టం"

" మరి ఏమి చేస్తారు ?డబ్బులు దేనికి తీసుకుంటారు ?"

" హై వే కి కాస్తంత  పక్కన ఎక్కడో కొంచెం జాగా కొన్నాము . దానిలో సగం గా పెద్ద మర్రి చెట్టు కూడా వచ్చింది . ఆ చెట్టు కింద ఓ చిట్టి గుడి కట్టాము . దానికి ఫది బార్ల దూరంలో చెరువు తవ్వాము - బాగా  నీరు పడ్డది.  చెరు గట్టున నాలుగు తడికల బాత్రూములు -- ఆరు కట్టాము .వాటికి పాత పట్టు చీరలు చుట్టాము .వాటికి  సుమంగళీ సూట్స్ అని పేరెట్టాము . మా మర్రి చెట్టుకు కారు పార్కింగ్ చేసి కారులోని స్త్రీలు ఎవరైనా లోపలకు రావచ్చు . మా బాత్రూం లో స్నానాలు చేసి పోవచ్చు అది బిల్కుల్ ఫ్రీ . కానీ చెరువులో దిగి జలకాలు ఆడితే 200 రూ టికెట్ వుంది . దీండ్లో గోల్డ్ టికెట్ కూడా పెట్టాం .500  రూ  గోల్డ్ టికెట్ కొన్న వారు

చెరువు స్నానం చేసి వచ్చే సరికి రికి - గంగాళం లో కాగ పెట్టిన వేడి నీళ్లు తీసుకెళ్లి తడికల బాత్రూం లో పెడతాము . ఆ యమ్మలు ఆళ్ల పల్లెటూళ్లను గుర్తు చేసుకుంటూ స్నానాలు చేయొచ్చు అని  . ఆపై పసుపూ కుంకుమ లు బహుమానంగా ఇస్తాము . కావలనంటే ఆ  అమ్మలు పోయి మర్రి చెట్టు కింద శివలింగానికి పూజలు చేసుకునే అవకాశం కూడా ఫ్రీ ఇచ్చాము .

ఏది ఐన సరే తల్లితో వచ్చిన  పిల్లలకు ఫ్రీ .  ఇది కాకా సూపర్ ప్లాటినం టికెట్ పెట్టాము . దీని ధర 2000 .
చెరువు స్నానాలు - దేముడి దర్శనం అన్నింటిలోనూ కామాన్ . ఈ టికెట్లో
ఆడతల్లి కోరుకున్న పుల్లలతో నీళ్లు కాచు తాము . రావి పుల్లలు - ఆవు పిడకలు - తుమ్మ పుల్లలు, జిల్లేడు కంప ,  ఏవి కావాలంటే అవి మా స్టాక్ లోనుండి ఎంచుకో వచ్చు . అవుపిడకలు ఎంచుకున్న వారికి ఆవు పిడకల  బూడిదని పళ్ళు తోముకోవటానికి , కొబ్బరిపీచు ప్లస్ ఆవు బూడిదా కలిపి  వళ్ళు తోముకోవటానికి ఇస్తాము . కావాలంటే మిగిలింది ఇంటికి పార్సెల్ చేసి ఇస్తాము . ఇది కాక మదగ్గిర మూడు  తిరగళ్ళు  - రొండు రోళ్ళు కూడా పెట్టాము .
ఆదతల్లులు కోరుకుంటే వాళ్ళ పసుపు , కుంకాలూ  వాళ్ళే ఈ రోళ్లల్లో దంచుకోవచ్చు - లేదా మా ఆడ ఎంప్లొఎస్  దంచి పెడతారు . ఇట్లాగే కుంకుమ సున్ని పిండి కూడా దంపించు కోవచ్చు . ఆడ తల్లులు  పసుపు పూసుకుని సుమంగళి స్నానాలు పూర్తి చేసుకొని వచ్చే సరికి - ఒక రోట్లో గోరింటాకు రుబ్బి ఉంచుతారు . అది పెట్టి హెయిర్ డ్రైయర్ తో డ్రై చేస్తారు మా స్టాఫ్ - ఇంకో రోలు ఖాళీ గా వుంది కదా ?
ఈ గోరెంటాకు పండే లోగా - కోరుకున్న వాళ్లకు కోరుకున్నట్లుగా వాళ్ళ కళ్ళఎదుటే  - ఇడ్లీ పిండి , గారె పిండి , దోశె పిండి, పెసరట్టు పిండి  రుబ్బి పార్సెల్ ఇస్తాము .వాళ్ళు ఇంటికి పోయి వాళ్ళిష్టం వచ్చినట్లు తినటమే మిగులు . అమెరికా నుండి ఎయిర్ పోర్ట్ కి వచ్చి ఇంటి దారి పడుతున్న వాళ్లకు మా సుమంగళి సూట్స్ చాల

చాలా నచ్చాయి . అడ్వాన్స్ బుకింగ్లు కూడా అవుతున్నవి .అన్నీ పోగా  రోజుకు పాతిక ముప్పై వేలు మిగులుతున్నాది  " అని వెంకయ్య అన్నాడు .
" నువ్వు నన్ను మీ మేనేజర్ గా పెట్టుకో - ఇంకా కొత్త సలహాలు ఇస్తాను " అని నేను అన్నాను . అయన ఒకే అన్నాడు .
ఇంకా కొత్తగా ఏమి సౌలత్ లు పెట్టాలో - నా తల్లుల వంటి మీరు నాకు చెపితే - సుమంగళి సూట్స్ కి మేనేజర్ హోదాలో నేను వాటిని అమలు పరిచి - మీకు ఓటీపీ పంపుతాను.మీరు వచ్చి టికెట్ లేకుండా చెరువు స్నానాలు చేసి పోదురు గాని .
వినోదం కోసం వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత రచన

మీకు వినోదం కావలేనా?  విజ్ఞ్యానము కావలెనా ?? అని అడుగా వచ్చునా ?